మైలవరం శ్రీ బాలభారతీ సమాజమువారిచే ప్రదర్శ్యమానము.

శ్రీ

# ధరణికోట

రెడ్డివీరుల సంగ్రామకథ

## 7 అంకముల నాటకము

స్వరాజ్యరథము, సతీ అనసూయ, గంగావతరణము, భీష్మ బ్రహ్మచారి, రంగూన్ రౌడి, తాజ్ మహాలు, మున్నగు ననేక నాటకములను రచించిన

కీర్తిశేషులైన — దేశపాండ్యా

## సోమరాజు రామానుజరావుగారిచే

రచియింపబడినది.

★


పబ్లిషర్ :

కురుకూరి సుబ్బారావు సన్.

( కురుకూరి స్వరాజ్య వెంకట సత్యనారాయణరావు )

ప్రొప్రయిటరు :

సరస్వతీ బుక్ డిపో, విజయవాడ-1.

రైల్వే బుక్ స్టాలున్ : పవరుపేట, తాడేపల్లిగూడెము.

అయిదవ కూర్పు 1000 ప్రతులు

గ్రామస్వరాజ్య ప్రెస్ నందు ముద్రింపబడినది.


 1957 [వెల రు 1-12-0

## —• పురుషులు •—

1. ఖడ్గ నారాయణుఁడు—కథానాయకుఁడు
   (కేదారనాథుఁడు—ఖడ్గనారాయణుని యతివేషము)
2. అనవేమారెడ్డి—ఖడ్గనారాయణుని తండ్రి
3. అనపోతనాయఁడు—రాచకొండరాజు; రెడ్ల శత్రువు.
4. కొండారెడ్డి—అనపోతనాయని సేనాని
5. వీరారెడ్డి—అనపోతనాయని మంత్రి; కొండారెడ్డిమామ
6. మల్లినాథుఁడు } ఖడ్గనారాయణుని మిత్రులు
7. కృష్ణరాజు }

పఠాణీలు–ఖడ్గనారాయణ మల్లినాథ కృష్ణరాజుల మారువేషములు.

8. వెంకన్న—అనపోతనాయని సేవకుఁడు
9. ఎఱ్ఱాప్రగడ—అనవేమారెడ్డి మంత్రి
10. మాధవనాయఁడు—అనపోతనాయని తమ్ముఁడు

## —• స్త్రీలు •—

11. వీరభద్ర—కథానాయిక : వీరారెడ్డి కుమార్తె
    (వీరభద్రుడు – వీరభద్ర మారువేషము)
12. అన్నపూర్ణ—వీరభద్రసఖి; కొండారెడ్డిని వలచినది
    (కళాపూర్ణుఁడు – అన్నపూర్ణ మారువేషము)
13. నీల—అన్నపూర్ణ సఖి
    (విక్రమరాజు–నీల మారువేషము)
14. రాణి—అనపోతనాయని భార్య
15. మాలి—రాచకొండదివాణపు దాసి

---




ప్రొప్రయిటరు : : సరస్వతీ బుక్ డిపో, విజయవాడ-1.

# ధరణికోట

## రెడ్డివీరుల సంగ్రామకథ

## ప్రథమాంకము



### రంగము 1

(రాచకొండలోని వీరారెడ్డి మందిరమున)

పరివేశము — కొండారెడ్డి, వీరారెడ్డి.

కొండా—వెనుకటి మాటలకేమి? ప్రస్తుతపు సంగతి ననుసరించి మాటలాడఁ గూడదా!

వీరా—నాయనా! అట్లుగాదు. నా మాట వినుము. మన వీరభద్రి కింకను బాల్యముగదా! ఇప్పుడు దాని వివాహప్రశంస యెందులకు?

కొండా—మామా! నీ మాటలకు నాకు నవ్వు వచ్చుచున్నది. వీరభద్రి యింకను బాలికయేనా? వివాహకాలమే సమీపింపలే దనుచుంటివా? ఇది నన్ను బుట్టలో పెట్టుటకు వచించు వేషములు గాని;

సీ. చిఱునవ్వు వెన్నెలల్ చిందులాడెడు ముఖేందు
మండలమ్మునుఁ గల్గు మందగమన;
యువజనంబుల గుండె లవియఁజేసెడు క్రూర
నిశితాంబకంబుల బిసరుహాక్షి;
పరిణయ ప్రశంసచే, నణుమాత్రి మఱుగాను
చెక్కుటద్దమ్ముల చిన్నెలాఁడి;
బాల్యంబు దొలఁగిపోఁ బరువంపు మిసమిస
లారంభమగుచున్న యలరుబోఁణి;

గీ. పదియు నై దేండ్లు పైబడ్డ పద్మగంధి;
సకలవిషయవిజ్ఞాన ప్రశ స్తశీల
యైన వీరభద్రియె బాలయగునయేని
బాలలీఁక జన్మమందని వారుగారె?

చిన్ననాటినుండియు, వీరభద్రిను, నాకిచ్చి వివాహము చేయుదునని, యాశపెట్టితివి. ఇప్పుడు నీవిధము చూడఁగా వేఱు భంగి యైనట్లు తోఁచుచున్నది. నేను నీ మేనల్లుఁడనగుటచే వీర భద్రిను పరిణయమాడుటకు నాకన్న నధికారముగలవారు లేరు. నా కూరక కోపమును దెప్పింపకుము. బాంధవ్యమును పాడుజేసికొని ముసలితనమున లేనిపోని యారాటము పాలుగాక సక్రమముగ వీర భద్రిను నాకుఁ గన్యాదానము సేయుము.

వీరా—నీవు లేనిపోని యనుమానములు, కడుపులో నుంచుకొని ఏమేమో—పలుకుచున్నావు, కాని యన్నపూర్ణ—మొదటి నుండియు—నీపై ననురాగముతో నున్నందున, పాపము దాని నన్యాయముచేసి, నీకు వీరభద్రినిత్తునా యని, యాలో చించుచున్నాను.

కొండా—ఓహోహో! ఎంతపరోపకార పరాయణుఁడవు! అన్నపూర్ణ నన్ను వలచినదఁట! తాను—పుత్రికావాత్సల్యమును సహి తము మానెనఁట! సత్యహరిశ్చంద్రుని చంపి పుట్టితివిమామా! నీ కుటిలబుద్ధిని నాకడనా చూపెదవు! నేనింకను బాలుఁడనను కొంటివా లాలించుటకు? నీకుఁగల సమర్థత నాకును గలదు, నీవు వీరభద్రినీయనని—బెట్టుచేసినచో—నీమాటలకు మోస పోయి, విశ్వసించి యూరకుందునని, యొకనాఁడుం దలంప కుము. ఏవిధము చేతనైన — వీరభద్రిను నేను, వివాహ మాడియే తీరెదను.

గీ. చదివినాఁడను ♦ సకల శాస్త్రములు నేను
రాజునకు ముఖ్యుఁడను నేను ♦ రాచకొండ

సేనలకు నధిపతిన్నైతి ♦ చిన్ననాటి
మాటలేటికిఁ బల్కెదో ♦ ... ... నీవు!

వీరా—అదికాదు-నాయనా! నిన్ను సే... ...నని, యంతగా నాగ్ర హించెదవు. మొదఁటినుండియు ...న్నపూర్ణకును, నీకును, గదా-యనుకూల్యము మెండు ...న్నపూర్ణ యభిప్రాయము నెఱింగి నీకల్లె వీరభద్రను... ... ...

కొండా—అన్నపూర్ణకును, నాకును; చిన్ననాటినుండియు— నాను కూల్యమా! ఎవరుచెప్పిరి నీకో? అన్నపూర్ణ యట్లు చెప్పె నదా? కాక, నీవు చూచితివా మాయానుకూల్యమును; అను కూల్య మనుమాట కర్థమేమి? వీరభద్ర నన్ను వలదననెనా— దానికి లేని యారాటము నీకేల? నీకీ మాధ్యస్థమేల? నీ పెత్తన మేల! ఇన్నిమాట లెందులకు? నేడు విషయములన్నియును వింటిని—నీవు, మనరాజునకు నైరులగు కొండవీటి రెడ్ల కెవ్వరికో—నీకుమార్తె నిచ్చెదనని, వారితో వీరితో— ననుచున్నావట— నాకు తెలిసినది. ఈమాట రాజు చెవిఁ బడినచో—నీగతి యేమగునో — యాలోచించుకొనుము, అంత అభిమానము గలవాఁడవైనచో—రెడ్డివై యుండియు— తొలుత నుండియు—వెలమల నేటికి- పొట్టకూటికిఁగొల్చు చుంటివి?

(తెరలో) కొండారెడ్డిగారూ—కొండారెడ్డిగారూ.

కొండా— ఎవరది?

(తెరలో) రాజుగారి సెలవైనది.

కొండా— ఇదె వచ్చితిని మామా! సరే! నీవు- నాకు బ్రత్యుత్తర మీయ నక్కరలేదు. ఒక్కటేమాట చెప్పెదను

గీ॥ నాకు నన్యాయమొనరించి నీ కుమారి
నింకొకనికిచ్చు యత్న మొకింత నాదు

చెవినిఁ బడెనేని యప్పుడె నీ జీవితంబు
సాంతమగు; వీరభద్రి వితంతువగును

(కొండారెడ్డి కోపముగా పోఁబోవుచుండును. ఖడ్గనారాయణ, మల్లినాథు లెదురగుదురు. కొండారెడ్డి వారిని తీవ్రముగ బరికించి నిష్క్రమించును.)

వీరా— ఎవరు నాయనా మీరు?

ఖడ్గ— అయ్యా! వీరారెడ్డిగా రింటివద్ద నున్నారా?

వీరా— మీరెవ్వరు? మీ వేషభాషల వలన మీరు మహారాజ కుమారులవలె గనఁబడుచున్నారు. నేనే వీరారెడ్డిని. నావలన మీకేమి కార్యమున్నది? మీరెక్కడనుండి వచ్చినారు?

ఖడ్గ— మావృత్తాంతమును, మీకు సావకాశముగ మనవిచేసెదను. మేము మహారాజ కుమారులము కాము. కాని యొక మహారాజునకు ముఖ్య సేవకులము. రాజకార్య దురంధరులమై వచ్చినాము. మమ్ము మీరతిథులుగా పరిగ్రహింప వచ్చును?

వీరా— ఓహో! అలాగునా! మీరు వెలమలా? రెడ్లా? కమ్మలా. లేక ...

ఖడ్గ— నేను రెడ్ల బిడ్డను. ఈతడు బ్రాహ్మణ కుమారుడు.

వీరా— ఓహో! అట్లయిన నభ్యంతర మేమున్నది? దయచేయుడు.

ఖడ్గ— మేము ధరణికోటనుండి వచ్చినాము. కొండవీటి యనవేమారెడ్డిపంపిన రాయబారులము. మాకు మీ రాజుగారగు సనపోత నాయని దర్శనము చేయింపవలెను.

వీరా— అట్లే మాటలాడుదము రండు.

(అందరు నిష్క్రమింతురు)

## 2 వ రం గ ము

( రాచకొండలోని వీరభద్రి అంతఃపురము )

ఖడ్గనారాయణుడు శయనించుచుండఁగా వీరభద్రియు అన్నపూర్ణయు ప్రవేశింతురు.]

అన్న— వీరభద్రా! వీరభద్రా! భోజనమైన సరిగా చేయనీయక యింత త్వరగా రమ్మని నన్నెందులకు రప్పించితివి? నేను విన వలసిన విశేషము లేమియు లేవుగదా?

వీర— అబ్బా! అన్నపూర్ణా! యెంతనోరే నీది. కేకలు వేయకు. మెల్లగా మాటలాడుము. నీవు వినవలసిన విశేషమే కాదు. కనవలసిన విశేషముకూడ నున్నది.

అన్న—అలాగుననా! సరే! వీరారెడ్డి బాబయ్యగారు భోజనముచేసి కోటలోనికి వెళ్ళినారా?

వీర— వెళ్ళినారు.

అన్న— నిన్న సాయంకాలము మరల బాబయ్యగారికిని, కొండారెడ్డి బావగారికిని యుద్ధము జరిగినదఁట! ఆయన భోజనము మాని వేసి ఎక్కడికో వెళ్ళినారఁట నిజమేనా?

వీర— నీవు కోరి వరించిన కొండారెడ్డి ప్రతాపము నీకు క్రొత్తది కాదుగదా! ఈయుద్ధము మనయింటఁ బ్రతిదినమును జరుగు చునే యున్నదిగాని క్రొత్తది గాదుగదా!

అన్న—భద్రా! వరించినంతమాత్రమున నేమిలాభమున్నది! ఆతని చిత్తము నీయందు పూర్తిగ లగ్నమైయున్నది! ఎందఱెన్ని విధముల బోధించిన, నాతనిమనస్సు పాషాణమువలెఁ గదల కున్నది.

వీర—అన్నపూర్ణా! ఈవిషయమున నాకేమియు సాధనాంతరము కనఁబడదు. నిన్న సాయంకాలమునఁ గోటలోనుండి రాఁగానే

యతఁడు పెట్టినరవ్వ సే నెంతని చెప్పఁగలను! తుదకు మాయ యయ్యెను, నన్నునుఁగూడ చిదుకఁదన్ను నేమో యను భయము గూడఁ గల్గినది సర్వేశ్వరుడు... ... ... ...

అన్న—అబ్బా! ఎందులకీగొడవ! నిత్యమును చచ్చువారిని గూర్చి యెంతని యేడ్వఁగలము? ఈసంగతి విడిచి నన్నుఁ బిలిపించిన కారణమేమో మొదటఁజెప్పు.

వీర—చెలీ! నిన్ను రప్పించుట కొక మహాకారణమున్నది. నిత్యమును మనయింటఁ జఱుగుచుండిన యీ చిత్రనాటకములలో అంత కన్నఁ జిత్రమగు మఱియొక యంతర్నాటకము జఱిగినది.

అన్న—అలాగునా! ఏది—చెప్పు, చెప్పు—

వీర—చెప్పుటకాదు నీకు ప్రత్యక్షముగఁ జూపించుచు చెప్పవలసి యున్నది. నీవు గట్టిగ మాటాడక నావెనువెంటనె యీ ప్రక్కనున్న గదిగుమ్మమువద్దకురమ్ము. నోరు విప్పితివా చూడ వాయగొట్టెదను.

అన్న—అబ్బా! లేదే—

వీర—అన్నపూర్ణా! చూడు; ఈతలుపుసందులోనుండిచూడు అచ్చట కవాచీమంచము నీకుఁ గనఁబడుచున్నదియా?

అన్న—(చూచి) చెలీ! కనఁబడుచున్నదే! ఆహాహా! ఆమంచముపై శయనించియున్న దివ్యమంగళ విగ్రహ మెవ్వఱిదోకదా.

1 వ అ ను బ ం ధ ము

వీర—గట్టిగ మాటాడకు—ఆజగన్మోహనాకారమును, చక్కఁగఁ జూచి, సృష్టియందు బ్రహ్మదేవునకెంత చాకచక్యమున్నదో కనిపెట్టు—

అన్న—కనిపెట్టితిని—ఆహా! ఎంత సుందరపురుషుఁడు—ఆ సౌంద ర్యమునుఁ జూచు [illegible] కన్నులుచాలవు. చెలీ! వీరభద్రా! ఆతఁ డెవ్వరో [illegible] చూడదఁటే.

వీర—తొందరపడకు నిన్నరాత్రి జరిగిన యంతర్నాటకమున కితఁడే కథానాయకుఁడు.

అన్న—అలాగుననా—అట్లయిన, కథానాయకివి నీవు కాఁబోలు ? నేను!

వీర—ఛపే—నోరుమూసికొనుము. ఇంద నా వెంటరా! తక్కిన సంగతులు చెప్పెదను.

(ఇరువురు కూర్చుందురు)

వీర—చెలీ

ఆ. కొండవీటిరెడ్డి కుల ♦ నాథులంపఁగ
ధరణికోటనుండి ♦ తడయ కిపుడు
రాయబారిగాఁగ నీ ♦ యోధవరుఁడు తా
నరుగుఁ దెంచె విక్రమాఖ్యు ♦ డగుచు.

అన్న—చెలీ! ధరణికోటలో, నీతని కేమి యుద్యోగమున్నది?

వీర—ఆసంగతి నాకంత బాగుగా తెలియదుగాని, యువరాజున కితఁడు ప్రాణమిత్రుడఁట! అనఁగా—నేదో గొప్పయుద్యోగము నందే యుండవచ్చునని, మన మూహింపవచ్చును. ఆ సుందర విగ్రహము జూచినప్పటినుండియు, నాహృదయము... ...

అన్న—ఊఁ ఊరకుండెద వేల? కానిమ్ము నీ హృదయము? ఏమగు చున్నది? తహతహపడుచున్నది. వ్యాకులమొందుచున్నది. త్వరపడుచున్నది. ఇంతేనా?

వీర—ఛీ! ఏమిమనిపి.వి? నీ జన్మకాలనక్షత్రి మెట్టిదో కాని యీ పాడు వేళాకోళము నిన్ను విడువకున్నది.

అన్న—భద్రా! భయములేదు. చెప్పు—చెప్పు

వీర—చెప్పకముందే పరిహాసమున కారంభించినదానవు. చెప్పిన నింకెంత యల్లరి చేసెదవో యని గొంకుచున్నాను.

( 2 వ అనుబంధము )

అన్న—వీరభద్రా! ఊరక యొకమారు పరిహసించితినిగాని, మాటి మాటికి నట్లనుటకు—నేనేమంత యవ్యక్తురాల ననుకొంటివా?

వీర—నాహృదయము తామరాకుపైని, నీటిబొట్టువలె చలనశీలమై—యూరక కొట్టుకొనుచున్నది. నిన్నటిరాత్రి చాలసేపటివరకు, నా వివాహమును గూర్చి మామయ్యయు, నీతఁడును ప్రసంగించిరి. నేను చాటుననుండి వారి సంభాషణమంతయు వింటిని.

అన్న — ఏమి సంభాషించుకొనిరి? ఆ సంభాషణలో నీతనికి నీ యెడ ననురాగమున్నట్లు తేఁటపడినదా? నీ తండ్రి మాటలు నీ యభిప్రాయమున కేమైన ననుకూలముగా నున్నట్లు తోఁచినదా ?

వీర—ఈతనికి నాపై ననురాగము లేదని చెప్పజాలను. మా తండ్రి మాటలు నాకంత లాభకరమైనవి గావు.

అన్న—"అంత లాభకరములు కా" వనగా కొంతవరకు లాభకరములని యర్థము. ఆ కొంత లాభకరమైన దేదో చెప్పు.

వీర—నన్ను ధరణికోట యువరాజైన యుగపోతారెడ్డి కిచ్చి. వివాహము చేయుటకు వారిరువురును నిశ్చయించిరి.

అన్న—ఓహో! బాగుగానున్నదే ? అటులయిన నీ వదృష్టవంతురాలివేకదా ? యువరాజునుఁ బెండ్లియాడినచోఁ గ్రమక్రమముగా నీవు కొండవీటి సీమకెల్ల మహారాజ్ఞివి కాగలవు. వీరభద్రా ! అప్పుడు నీవు నన్ను పలకరించెదవా ?

వీర—చెలీ ! నిజము చెప్పెద వినుము. నాకా సంబంధ మిష్టములేదు. నాకా యైశ్వర్య మక్కరలేదు.

అన్న—ఎందుచేత ?

వీర—నా కిష్టము లేనప్పు డెందుచేతనైన నేమి ?

( 3 వ అనుబంధము )

అన్న—సరే ! అట్లయిన యెడల నాకా యువరాజక్కఱలేదనియు, ఊరునుఁ బేరునుఁ దెలియని యీ రాయబారియెవఁడో వీనికే యిచ్చి వివాహము చేయవలయుననియు మీ తండ్రితోఁ జెప్పరాదా ?

వీర—నీ తెలివికి సంతోషించితినిలే. ఈపాటి యుపాయము నెఱుఁగక నిన్నుఁ బిలువలేదు. అన్నపూర్ణా! నా మనోభిప్రాయమును నీకుఁ దెలిపితినిగదా ? ఈ సంగతి నెట్లయిన నీవు మా తండ్రితోఁ జెప్పవలసి యున్నది.

(తెరలో ఖడ్గనారాయణగారూ ! ఖడ్గనారాయణగారూ)

వీర—అన్నపూర్ణా ! నీవా గదిలోని కేగిలేపుము. ఆయన కొఱకెవరో వచ్చినారు.

అన్న—నేను లేపను. నీవే లేపుము.

వీర—అబ్బా ? నాకు సిగ్గువేయుచున్నదే? నీవు లేపగూడదా ఏమి?

అన్న—నేనే యంత సిగ్గులేనిదానను కాఁబోలును ?

వీర—అబ్బ తల్లీ? ఎంతవడిదానవే !

అన్న—ఏమి నీకంత యభిమానమేల ? నీవేల లేపఁగూడదు ?

ఖడ్గ—(లేచి) మీ రెవ్వరును లేపనక్కఱలేదు. నేనే మేల్కొని యున్నాను.

క. ఏలా మేల్కొలుపుట కో
బాలామణి! యింత సిగ్గువడియెదు? నీ ప్రే
మాలోకనంబులను దృఢ
జ్వాలంధ్భులఁబడతి; నెందు జనియెద నబలా!

వీర—కపటమువహించి దొంగనిదురఁబోవు మీవంటివారిని బంధించుటతో సరిపోవదు. ప్రహారణంబులు సయితము కావలసినదే!
[పూలదండవిసరి, వీరభద్రియు, అనుసరించి యన్నపూర్ణయు నిష్క్రమింతురు.]

ఖడ్గ—(పూలదండ తీసి కన్నులకద్దుకొని)

( 4 వ అనుబంధము )

ఆహా! ధన్యుఁడనైతినిగదా!

ఆ. లలన, నన్నుఁగాంచి లజ్జాభరంబున,
మరునిచెఱకువిల్లు మాడ్కి వంగె
వింటికోలనుండి వెడలి పుష్పాస్త్రముల్
నాదు గుండెలవియు నట్లొనర్చె!

మల్లి—(ప్రవేశించి) మిత్రమా! భగవత్ ప్రసాదమా యేమి! కన్నుల కద్దుకొనుచున్నావు?

ఖడ్గ—మిత్రమా! మల్లినాథా! వచ్చితివా! నీతో—నొకవిశేషము నెఱిఁగింపవలయునని యుంటిని.

మల్లి—క్రొత్త పెండ్లికుమారునివలె - కలకల లాడుచుండిన నిన్ను చూడగనే- యేదో విశేషము గలదని తలపోసితిని - యేమా విశేషము?

ఖడ్గ—మిత్రుఁడా! వీరారెడ్డి కుమార్తెయగు వీరభద్రికు నాపై గాఢమగు వలపున్నట్లు నేఁడు వారి మాటలవలనఁ దెలియవచ్చినది. నేను వారియెదుటకు వచ్చునప్పటికి సౌందర్యగనియగు వీరభద్రి నాపై నీ పూలదండ విసరి చనినది చూడు.

( 5 వ అనుబంధము )

మల్లి—మిత్రమా కొంతకాల మోపిక పట్టితివేని, నీ మనోరథము సిద్ధించును. నీకు కల్యాణకాలము సన్నిహితమై యున్నట్లు మొన్న మీ తండ్రిగారికడ కాలాంత్రికులు వచింప వినలేదా! కావున శుభసమయము వచ్చినది.

(తెరలో) ఇంకను కాలేదు—కొంతవ్యవధి కలదు.

మల్లి—హా! ఏమిది! శుభము సంకల్పింపఁగా నీదురపశ్రుతి వినఁబడినది.

(తెరవంకజూచి) యెవరాఁపల్కినది?

(మరలఁ దెరలో)

దేవా! నేను రాజభటుఁడను. వీరారెడ్డిగారు కోటలో మహారాజుగారితో సంభాషించుచు మిమ్ము వెంటనే తీసుకొని రా వలసినదని పంపినారు. ద్వారరక్షకుడు "సభకు వేళ యైనదా?" యని యడుగ "కాలే"దని చెప్పుచున్నాను. తప్పున్న క్షమింపుఁడు.

ఖడ్గ—అట్లయిన నిప్పుడే వచ్చుచున్నాము. (అందరు నిష్క్రమింతురు)

3 వ రంగము

(వీరారెడ్డి గృహమునందొక భాగము)

(కొండారెడ్డి యాగ్రహముతో ప్రవేశము)

కొండా—(6వ అనుబంధము) ఎంత కండకావరము? ఉద్దండ విక్రమాఢ్యుండగు నీ కొండారెడ్డి బ్రతికియుండఁగా వీరభద్రును కన్నెత్తి జూచుటకు త్రినేత్రునికైన నలవియగునా? ఓరోరి గుడ్డి ఖడ్గనారాయణా! నీకీ పేరాశ యేల జనించినది? నీ బ్రతు

కొకటి నిశ్చయమైన ప్పుడుగదా వీరభద్రను పెండ్లియాడుట కుఁ బయత్నింపవలెను. నీకీ దుర్బుద్ధి పుట్టినదని తెలిసినంతనే నీ విషయమై మహారాజుగారితో మాటాడినాను. రేపటి దర్బారుదినము గడచి రాత్రికి యింటికిఁ బోయినచో నీవు పరియోజకుఁడవే!

సీ॥ రాయబారంబని రాచకొండకుఁ జేరి
గర్వమందిన నీదు గడుసుఁ దనము
చుట్టంబులను మిష పెట్టి వీరారెడ్డి
సదనంబుఁ జేరిన సాహసంబు
వినుత సద్గుణభద్రి వీరభద్రను గూడ
నెంచిన నీ నయవంచనంబు
అనపోతనాయనిఁ దునుమాడ గర్వ వి
రోధియై పట్టి పిదోహ బుద్ధి

గీ॥ ధరణికోటనుఁ బాలింపఁ దలఁచినట్టి
వీరభద్రను పెండ్లాడఁ గోరినట్టి
కోరికలు భిన్నమందు దర్బారునాడు
ఖడ్గనారాయణా! యింక గాచుకొమ్ము.

అయ్యో! పాపము... నాకు నవ్వు వచ్చుచున్నది. ఆ మంద భాగ్యుఁడు కేవలము మోహాంధకారమున మునిఁగి తనకు రా నున్న దుర్దశను గుర్తెరుఁగఁ జాలకున్నాఁడు గదా! సాక్షాంగ లక్ష్మి కానున్న వీరభద్రి నామూర్ఖుఁ డాసించుట కొదమ సింగ మాసించిన గోమాంసమును గోమాయువు కోరినట్లున్నది గదా! ఇంతకును— వీని ననవలసిన దేమున్నది?___ఓసీ! ___వీరభద్రా! నీ తెలివి తేట లేమైనవే! యెచటనుండియో వచ్చిన, యీ యనామధేయునియందు—నీ కనురాగమా!—

ఆ సంగతి అన్నపూర్ణచే నీ తలిదండ్రులకు రాయబారనూ! నేను వినలే దనుకొంటివా! నేను పెంచిన ముద్దు చిలుకవు. నా బాహు పంజరమునుండి యెట్లు తప్పించుకొని పారిపో గల వు? —అది వట్టి వెర్రియూహ —ఇంకనైన నీవు నీ బుద్ధి మర ల్చుకొమ్ము. ఆ ఖడ్గనారాయణుని నీవు వరించి వానియందు నా కాగ్రహము జనింపఁ జేయకుము. జనించినయెడల వాఁడు ప్రాణములతో నుండు టరుదు. సాగతులనుబట్టి చూడఁగా నీ విషయములో నన్నపూర్ణ శ్రద్ధగాఁ బనిచేయు చున్నట్లు కన బడుచున్నది. ఔనౌను. అది సహజమే... ...అందుకు కార ణము లేకపోలేదు. వీరభద్రి నెట్టులైన ఖడ్గనారాయణుని కం టఁ గట్టినయెడల, తన కింక నేను దక్కుదునను, ఫలాశ యా మెను పీడించుచున్నది. కాని యది వట్టిమాట!... ...రూపు రేఖలయం దేమి...ప్రవర్తనమునం దేమి ... యన్నపూర్ణ యుత్తమురాలే...ఆమె నాకు భార్యయగుట తగినదియే... కాని నేనేమి చేయఁగలను? వీరభద్రి నుండి నామనస్సు మర లినప్పుడుగదా యామె యభీష్టము సిద్ధించుట! అది యీజన్మ మున సమకూడదు... ...ప్రస్తుతము నేను చేయవలసిన పని యేమున్నది? అన్నపూర్ణ నెటులైన మంచిమాటలాడి... ... యామెవలన లోలోపల జరుగుచుండిన కృత్రిమములను బయ టకు లాగవలసి యున్నది. తరువాత చేయవలసిన పని యంత యాలోచింపవలసినది కాదు... ...అదిగో! కాలి యందెల చప్పుడు—ఒకవేళ అన్నపూర్ణ కాదుగదా! అన్నపూర్ణా! అన్నపూర్ణా!!

అన్న—(ప్రవేశించి) బావా! ఏమి సెలవు?

కొండా—అన్నపూర్ణా! పాప మిన్నాళ్ళకు మన వీరభద్రికోరిక నెర వేరినది. కార్యము కొనసాగువరకు నీవీ విషయమున మిక్కిలి శ్రద్ధగా పనిచేయ వలయును సుమీ!

అన్న—ఏమి కార్యము? ఏ కోరిక నెరవేరినది?

కొండా—నీవేమియు నెరుగనే యెరుఁగవా?

అన్న—నాకేమియుఁ దెలియదు.

కొండా—ఔను పాపము! నీ కెట్లు తెలియఁగలదు? పోనిమ్ము నేను జెప్పెదను వినుమవా?... వీరభద్రి ఖడ్గనారాయణుఁడను నొక రాయబాలెని వరించినది. వానియందు తనకుగల యనురాగమును... తన తలిదండ్రు కెరిగించి... తనకును... వానికిని పెండ్లి చేయుటకై—వారినిఁ బ్రార్థింపుమని దన చెలికత్తె యగు అన్నపూర్ణను నియోగించెను.

అన్న—నాకేమియుఁ దెలియదే, ఆమె నాతో నీప్రశంసయే యెత్త లేదు.

కొండా—కాదు—కాదు కొంచెమాగు విను—అంతట నన్నపూర్ణ నిన్న రాత్రి వీరభద్రి కోరికప్రకారము — ఆమె తల్లిదండ్రులకా సంగతి సర్వమును, నెఱిఁగించినది. అప్పుడు నేను చాటుననే యుండి. యీమాటలన్నియు- ఇంకనైన నిజము నొప్పుకుందువా? ఏమి మాటాడవు?

అన్న—కొండారెడ్డి బావా! అన్నియుఁ దెలిసిన పిదప నన్ని—ట్లుతర్జన భర్జనములు చేయనేల? క్షమింపుము...

[ 7 వ అనుబంధము ]

కొండా—అన్నపూర్ణా—నీవు వట్టి యమాయకురాలవు— వీరభద్రి కున్న గడుసుఁదనమైనను నీకులేదు. అబద్ధమాడుటయైన నెట్లో—తుదకు నీకుఁ దెలియదు. అందుచేతనే, నాయెద్ద బయలుపడిపోతివి-పోనిమ్ము ఐననేమి? ఒక్కసంగతి మాత్రము నేను చెప్పకతీరదు—నీవు వినక తీరదు—పాపము మన వీర

భద్రికు — ఖడ్గనారాయణుని యందంత, యనురాగముండుట సంతోషమే — కాని వానిసంగతి యేమైన — నాలోచించినదా?

అన్న——ఏమి యాలోచింపవలెనో — సెలవిండు——

కొండా——అట్లడుగుము. నీవు మంచి బుద్ధిగలదానవు — విను — ఖడ్గనారాయణుఁ డిచ్చట ప్రవేశించినప్పటినుండియుఁ — బట్టణమున, స్వేచ్ఛగాఁ దిరుగుచు — ప్రతిస్థలమునందును — మా మహారాజుగారి ననరాని మాటలాడి, యూరక దూషించుచున్నాఁడఁట. ఆసంగతి యెట్లో రాజుగారికి తెలిసినది. ఇంక వానిపాట్లు నీవే చూడఁగలవు.

సీ॥ వీరభద్రునిఁ బొంద వీక్షించినట్టి యా
మాయావి నరకాన రాయువఱకు
ధరణికోటను నేలఁదలఁచిన యాంక్రూరు
యమపురంబునుఁ జేరనంపువఱకు
భ్రమియింపఁజేసి వీరారెడ్డి కనుఁగప్పి
నట్టి దుర్మార్గు మట్టాడు వఱకు
వలఁచి నా మదన సౌభాగ్యలక్ష్మిని హరి
యించనెంచిన ద్రోహిఁ దుంచువఱకు

కనుమొగుడ్పను; దర్బారు దినమునాఁటి,
తనయవస్థనుఁ గాచుకొమ్మనుము, పిదప
లేమ వీరభద్రునిఁ గౌగలింపవచ్చు
నింపుగా కొండవీడు తా నేలవచ్చు.

అన్నా——సరే! అటులే చెప్పెదను; కాని — మీరన్నట్లు కార్యము విఫలమేయయ్యెనా — నాకుఁబట్టిన యవస్థయే — యించుమించుగ వీరభద్రికునుఁ బట్టఁగలదు. యిందు వింత యేమున్నది?

(౨)

కొండా—అదేమి? నీకేమి యవస్థపట్టినది!

అన్న—బావా! నీవునన్ను పూర్ణముగ నిరాకరించితివిగదా! ఇంత కన్న నవస్థ యేమికావలెను?

[8 వ అనుబంధము]

కొండా—ఓహో! తెలిసినది. అన్నపూర్ణా అహ్హాహ్హాహ్హా! - నీవు మాటలయందు మంచి యుక్తిపరురాలవుసుమా! కాని నన్నేమి చేయుమనియెదవు? నీ మంచిచెడ్డలు నీచేతిలోనే యున్నవి.

గీ. కోమలీ! నీవు - ననుఁ బొందఁగోరెదేని,
వీరభద్రిను నాకు నర్పింపవలయు
నవల నినుఁగూడ నేఁబెండ్లి యాడువాఁడ
సతులు నాకిద్దఱుంట దోషంబుగాదు.

ఏమి! బాగున్నదా!

అన్న—బాగునకేమిగాని, యీ విషయమున నామె నంగీకరింపఁ జేయుట ఫాలాక్షునకైన శక్యముగాదని నానమ్మకము.

కొండా—ఏమేమీ? అంగీకరింపదా! ఫాలాక్షుడేల? తొందఱపడకు - నేనే దాని నంగీకరింపఁ జేసెదను. తుదకు నాప్రాణము విసిఁగిన దానికన్నుల యెదుటనే దాని తల్లిదండ్రులను ఖండించి పారవైచెదను. దానికన్నులయెదుటనే ఖడ్గనారాయణు నింతముక్కలకిందఁ గొట్టించివేసెదను. నన్నుఁ జేపట్టనియెడల తుట్టతుదకు - దానికిఁగూడ నట్టిగతియే పట్టఁగలదని గట్టిగఁ జెప్పుము - పొమ్ము.

[9 వ అనుబంధము]

(ఇరువురు చెరియొక వంకకు నిష్క్రమింతురు)

4 వ రం గ ము

(రాచకొండ వీధి)

(మల్లినాధ ఖడ్గనారాయణులు ప్రవేశము)

ఖడ్గ—మిత్రమా! మల్లినాథా!

చ. పిల్చినవాఁడు నాకుతగు పీఠమునైన నొసంగలేదు; నా
పలుకులనైన పూర్ణముగఁ బల్కఁగనీయఁగలేదు; ముగ్ధుఁడై
యలసభలోనఁ దెల్పెఁదగునంచును నాయనపోతనాయఁడీ
చెలువున నక్క బరాభవముఁ జేసెఁగదా పిలిపించి మిత్రమా!

(నీల ప్రవేశించి ప్రక్కఁగా నిలుచును)

మల్లి—మిత్రమా! ఖడ్గనారాయణా! ఇందులకు సందేహమేమి? రెడ్లకును, వెలమవారికిని, తొలుతనుండియు – నన్యోన్య మహావైరానలంబు రవుల్కొనుచుండిన వృత్తాంత మెవ్వ రెఱుంగనిది. అందును, యుక్తాయుక్త విచారణలేని భూపాలుఁడు గావున నట్లు వచించియుండును. ఐనను సభాదిన విశేషములంగూడ చూచెదముగాక! తినబోవుచు రుచు లడుగనేల?

ఖడ్గ—మల్లినాథా! నేడునాకు దుర్నిమిత్తములు పెక్కులు గల్గుచున్నవి. కార్యము శుభముగాఁ బరిణమించునని తోఁచదు.

మల్లి—అట్లయిన దానిఫలితమును త్వరలో ననపోతనాయఁ డనుభవించును – మనకు విచారమేల!

ఖడ్గ—నాకొక్క విచారము మాత్రము గలదు.—ఏమంటివా?

గీ॥ తండ్రికెఱిఁగింపకుండ స్వతంత్రబుద్ధి
రాయబారంబు మనమిట్లు సేయుచుంట
కార్య వైఫల్యమునకును, కదనములకు
గారణంబగునని పల్కఁగలఁడు తండ్రి.

మల్లి—అయినను మన మీ కార్యమును, రాజు క్షేమములు గోరి గదా యొనరించుచుంటిమి.

ఖడ్గ—మల్లినాథా! ఆ ప్రక్క నొకబాలికామణి నిలువఁబడియున్నది చూడు.

మల్లి—ఈమె యెవ్వరో తెలుసుకొందము.

ఖడ్గ—అబలా? నీ వెవ్వరు?

నీల—నాతో మీకేమి యవసరమున్నది?

ఖడ్గ—అవసర మేమియును లేదు. కాని

ఆ॥ రాజతనయభాతి రాజిల్లు నీవద
నాంబుజంబు; దాసివగుచు నిట్లు
కష్టపడుటకేమి కారణం బమ్మరో
భ్రాతరీతి నాకుఁబలుకు మమ్మ.

నీల—అయ్యా! తమరెవ్వరో నే నెరుఁగకపోయినను కేవల దయా పూరితములగు మీ చల్లనిమాటల నా దుఃఖము నుపశమింప జేసినవి. కాని నా దీన చరిత్రమును మీకెరిగించి మీమృదు మానసములఁ గష్టపెట్టుట కిష్టము లేకున్నది.

ఖడ్గ—సోదరీ! నీవట్లనగూడదు. నీ చరిత్రమును మా కెరింగించి నీ విపద్దశనుండి తప్పించుకొనుటకు నాచే గొంత సేవ చేయించు కొమ్మ. అంతదనుక నాకు సంతృప్తి గలుగదు.

నీల—అయ్యా! అట్లయిన వినుడు.

సీ॥ సధమలం బైనట్టి చాళుక్యరాజ వంశ
శమున బుట్టిన వీరజాతనయ్యా
ఘ్రాజితంబైన యీ భువన పర్వతదుర్గ
సార్వభౌముండు నా జనకుండయ్యా!
ఖలుం డనపోతని ఖడ్గధారకు నాదు
జనకుండు సోదరుల్ సమసిరయ్యా
బలవంతముగ జల్లపల్లి యుద్ధమున
పరులు నన్ దాసిగా పట్టిరయ్యా

గీ॥ దీనురాలనై యేవంక దిక్కులేక
గతి దొరంగిన నా మనఃకమల మిపుడు
తావక దయారసమున మోదమున నిండె
ధీరవర! మీ ఋణంబునుం దీర్చుటెట్లు?

( 10 వ అనుబంధము )

ఖడ్గ—హరిహరీ! ఎంతకష్ట మెంతకష్టము! సోదరీ! నీపేరేమి?

నీల—అయ్యా! నన్ను నీలయని పిలుతురు. ప్రతి సాయంకాలమును తిప్పరాజుగారి స్త్రీల నిమిత్తమై పూలుగోసి యిచ్చుచుండ వలయునని నాకు దేవిగారి యానతి గావున నేనిప్పుడు మంత్రి గారి యింటి కరుగుచున్నాను.

ఖడ్గ—అబలా! నీవింత విపద్దశయం దుండఁగా నేను నీకేమి యుపకారము చేయగలనో తోఁచుటలేదు. నీ సపక్నృతిగల్గు కార్యమేదేని యొనరింపుమని నీవే నియోగించినచో సత్వరమొనరింప సర్వదా సంసిద్ధుఁడను.

నీల—ఆర్యా! నా విపద్దశను తొలగింప మానవమాత్రులకు సాధ్యం కాదు. సర్వేశ్వరుఁడే కటాక్షించి నాకీచెఱను తప్పించిన యెడల వివాహము మాని కాశికాక్షేత్రంబున జపము చేసు కొనుచుఁ గాలముపుచ్చనున్నాను.

[ 11 వ అనుబంధము ]

ఖడ్గ—సోదరీ! దుఃఖభరంబు నందకుము. నీ విచార మచిరకాలంబున నంతమందఁ గలదు. నీవు నా స్మృతియందు మరువఁబడ కుందువుగాక!

( 12 వ అనుబంధము )

(అందరు నిష్క్రమింతురు)



# ధ ర ణి కో ట



## ద్వి తీ యాం క ము

### 1 వ రంగము

(అనపోతనాయని దర్బారు)

(మంత్రిసామంతులు, ఖడ్గ, మల్లి, పీరా, కొండా, మొదలగువారితో అనపోతనాయఁడు)

అందరు—(8 వ అనుబంధము)

అందరు—(కరవాలములను దగ్గరఁగాఁజేర్చి మరల నొరలోనుంచి) జయ్! అనపోతరాజ దేవేంద్రునకు జయ్!

అన—సభ్యులారా! మిమ్మందరను నేటి మధ్యాహ్నమున నీ సభామందిరమునకు రప్పించుటకు—రెండు ప్రబల కారణములు గలవు. రాబోవు పూర్ణిమా దివసంబున మనకందరకును గౌరవనీయులును, మా తండ్రిగారును, కీర్తి శేషులును నగు సింగభూపతి మహారాజుగారి జన్మదిన మహోత్సవమునుఁ గావించుటకు మనమందర మిూ వరకే నిశ్చయించుకొంటిమి.

సీ॥ బీదసాదల ఘోష వినరాదు; కనరాదు
కవులు సంతృప్తినిఁ గాంచవలయు
పౌర జానపదులు పర్వంబుగా నెంచి
యీ రాచకొండకు జేరవలయు
ఉద్యోగులెల్ల సముత్సాహభరితులై
పర్వంబునకుఁ దోడు పడఁగవలయు

పురమెల్ల సౌందర్య పూరితం బగునట్లు
శ్రీకరంబుగ గయిసేయవలయు

గీ॥ భటనిరోధమిూఁగి ప్రతివారు రాజమం
దిరము నెల్లయెడలఁ దిరుఁగవచ్చు
ఉత్సవం బటంచు నూరూరఁ జాటించి
ప్రజలకెల్లఁ దెలియబరుపవలయు.

ఈ విషయముల నెరిఁగించుట నేటి దర్బారునకు గల కారణ
ములలో మొదఁటిది.

అందరు—జయ్! అనపోతరాజ దేవేంద్రునకు జయ్.

అన— యిక రెండవ కారణము ... తెలియజేసెదను. కొండవీటి
వేమారెడ్డి వద్దనుండి, యేదో సందేశముం గొని ... యిరువురు
రాయబారము వచ్చినారట! వారు ప్రస్తుతము మన దర్బారు
నందే యున్నారు ... వారు తెచ్చిన సందేశమును వినిన పిదప
గర్తవ్యాంశ మూహింపవచ్చును.

ఖడ్గ—(లేచి) సభాధ్యక్షా! బహుళహయగజేంద్రస్ఫాదసేవాసహస్ర
హతకటకరాష్ట్రభష విద్విష్టసంపద్గ్రహణ పరమధనోద్య
దగ్రధాటీభట శ్రీమహిత జయవిజృంభుఁడును, అగ్ధిప్రత్యగ్ధి
దాననిరత అపరిమిత భూదాన పరశురామ అనేక నగరోష్ప
కంఠ ప్రతివాదిత బహువిధారామ పాండ్యరాడ్గజసింహాద్యనేక
బిరుదాంకితుండును నగు నవవేమ కొండవీటి ధాత్రీమండలా
ఖండలుండు మాచే బంపిన రాచకీయ సందేశమును విన్నవిం
చుచున్నాము.

కొండా—ఓయీ! మా దర్బారునందు మా శత్రురాజుల బిరుదా
వళులు నీ వుగ్గడింపక, తెచ్చిన సందేశమును మాత్రమే
చెప్పవలయును.

ఖడ్గ—ఆలాగుననా! వేమ భూపాలుని సంసిద్ధ బిరుదావళి నిచ్చట నుగ్గడింపనంతమాత్రమున నాతని కేమియు లోటు గలుగదు. మార్తాండుఁ డుద్దండ తేజశ్శాలియని యొకరేల స్తుతింప వలెను?—కావున నింక నా సందేశము మాత్రమే వినుడు.

కొండా—నీ వధికప్రసంగము చేయక సరిగా చెప్పు.

ఖడ్గ—ఓ మహారాజా!

ఆ॥ కొండవీడు రాచకొండ దుర్గములకు
గలుగు పూర్వవైర కాంక్షమాని
యుభయ రాజ్యములకు నుత్తమ లాభంబుఁ
గలుగ జేయుదారి గాంచుడయ్య.

అన—ఏమేమీ? అదిమాకు సరిగా బోధపడలేదు— మరియొకసారి చెప్పుము.

ఖడ్గ—ఇదుగో... చెప్పుచున్నాఁడను. నేటినుండియు రాచకొండ... కొండవీడులు స్నేహభావమున నుండవలయునని మా ప్రభువు కోరిక.

అన—ఎందుచే? ఈ స్నేహము మీమేలుకొరకా? మామేలుకొరకా?

ఖడ్గ—ఉభయుల మేలుకొరకు. అందు ముఖ్యముగ ఆంధ్రదేశము మేలుకొరకు.

ఉ. కాకతిరాజ్య మంత్యదశఁ గాంచిననాఁట గోలె సద్యశః
ప్రాకటమైన యాంధ్రరమ భాసిలుచున్నది తామరాకుపై
బ్రాకెడు కంకణంబువలె; భామిని రాజ్యము గర్భశూలమై
వీక దలిర్చువేళ తగవే! మనలోన వివాద మూనుటల్.

చ. సదమలమైన యాంధ్రవిలసద్ధ ణీరుహారమంతమందఁగా
చెదపురుగైన మ్లేచ్ఛుల యశేష రమావిభవం బసాధ్యమై
పొదలుట సంఘవైరములు పూర్ణతనందుట చేతగాదె! దు
ర్మదమున రెడ్లు క్షత్రియులు మత్సరముంగొని పోరనొప్పునే?

చ. మనము సహానుభూతిఁగొని మత్సరముం దిగద్రోసి మైత్రిచే
ననయము క్షీరనీరముల యట్లు చెలంగుదుమేని ధాత్రిపై
మనలనుఁ దేరిచూడఁ దరమా! యనపోత నరాధినాయకా!
ధనమునఁ దూగు నాంధ్ర వసుధాస్థలి లేమిని గుందఁజేతువే?

అన—ఓయీ! ఎందులకీ గొడవ! నీవింకఁ బ్రయాస పడనక్కరలేదు. మీ ప్రభువు పలికిన శ్రీరంగనీతులలోని సారాంశము మేము —పూర్తిగా గ్రహించితిమి. కొండవీటిరాజులు మాకు సామంతులగువఱకు... వారికిని, మాకును—మైత్రి పొసంగుట కలలోనివార్త – తనరాజ్యమునకు మావలన శత్రుభయము లేకుండ చేసికొన వలయునని యెంచి యాతఁ డీ కుయుక్తిని పన్నినట్లు తోఁచుచున్నది. కాని వేమారెడ్డి మాకు సామంతు డగువరకు—మా యుద్ధప్రయత్నమును, మేము మానము. మాయెడలఁ దనకంత భయముండి, మా స్నేహమునే గోరిన యెడల వెంటనే యతఁడు, మాసామంతు డగుట యుక్తమైన మార్గము. ఇట్లని మీ ప్రభువుతోఁ జెప్పుము. ఇదియే మీ సందేశమునకుఁ బ్రత్యుత్తరము.

ఖడ్గ—అయ్యా! వేమభూపాలుని సందేశమును మీరిట్లు—వ్యతిరేకముగ భావింతురని మే మనుకొనలేదు. మీవలననేగాక, త్రినేత్రునివలననైనను మా రాజ్యమునకు శత్రుభయములేదు. సంగ్రామ ధనంజయుడగు, వేమభూమీశ్వరుఁ డొకనికి సామంతుఁ డగుటను మాట కలలోనివార్త.

ఉ. అడ్డము వచ్చినంతఁ ద్రిపురాంతకునైన నెదిర్చి, యాజిఁ గా
లిడ్డ యరాతి వీరుల జయింపఁగ వీసరపోవ నౌనె? యీ
రెడ్డికులంపుబిడ్డఁడు ధరించిన ఖడ్గము; లేనిపోని యీ
యడ్డపు మాటలేటి కనఘా! యనపోత నృపాలచంద్రమా!

ఉ. నోటికి మిన్నగా ధరణికోట రణంబున పాండ్యరాడ్బలం
బోటమి నంది వెన్నొసగి యోర్వక పారదె? మీ రెరుంగరే
మాటలిఁకేల? మీ తలఁపు మానుడు రెడ్డికులంపు వైర మే
నాటికినైన మీపొగ రణంపఁగ గారణమా నిజంబుగన్.

అన—ఓయీ! నోటికివచ్చినట్లు మాటలాడకుము. యుద్ధక్రమంబన్న నెట్టిదో యెరుంగని పాండ్యరాజు దళంబుల గెల్చుట యొక పరాక్రమము గాదు. క్రిందటి ధరణికోట యుద్ధమున మీ పరాక్రమము సహింపలేక మేము తిరిగిపోలేదు. ఆ యనుమాసమే మిమ్ముల బాధించుచున్నది కాబోలు. ఇదుగో కొలది కాలములోననే మేము మరల వచ్చుచున్నాము. ఈసారి మీ ధరణికోటను మీరు కాపాడుకొన్న జాలును. ఎందులకీ వట్టి డంబములు.

గీ. భయముచే మిమ్ముగని నంత పారిపోవ
పాండ్యరాజులుగా మది భ్రమసినావొ
ప్రబల చాళుక్య రక్త తర్పణము లొసగు
క్షత్రియులు సుమ్ము వీరు విక్రమధనాఢ్య.

ఖడ్గ—ఔనౌను. రాచవారు పాండ్యరాజ వీరు లెట్లగుదురు.— పాండ్యరాజులు—ఆంధ్రదేశ చక్రవర్తియగు కాకతిప్రతాప రుద్రదేవ సార్వభౌమునిఁ గూడ సంగ్రామరంగమున నెదిరించిన వీరాగ్రేసరులు — రాచవారన్ననో యుద్ధక్రమంబన్న నెట్టిదో యెరుంగని పసిబాలురగు చాళుక్య రాజకుమారులను ఖండించిన ప్రతాపవంతులు—అందుచే వీరు......

అన—ఓరోరి మూర్ఖా! పాచాటా! శాంతించిన కొలదియు నీదుస్ప్రసంగ మతిశయించుచున్నదే! ఇచ్చటనుండి ప్రాణములను దక్కించుకొని పోవు యోగ్యత నీకు లేనట్లున్నది. నీ రెడ్డి పౌరుష మంతయు నిప్పుడే జూపకుము.

ఖడ్గ—రాజా! రెడ్డి పౌరుషమని నీవును పహసింపవలెనా? రెడ్డినారు రాచవారి కెన్నడుం దీసిపోడు సుమా! యిటు వినుము.

సీ. వినుత దుర్మదరాజ దమన ప్రవీణ భా
  విత శూరు లీ కొండవీటి రెడ్లు
ప్రబల క్షత్రియ మత్త భద్ర మాతంగ ని
  పాటసింహులు కొండవీటి రెడ్లు
సామ్రాజ్య విద్రోహ చంచత్క్రియారంభ
  విద్వేషు లీ కొండవీటి రెడ్లు
నిర్వక్ర విక్రమా ఖర్వ చమూసమ
  న్విత ధీరు లీ కొండవీటి రెడ్లు

గీ. పాండ్యరాజులవలె నోడి పారుటకును
మెతుకు దుర్గాధిపతివోలె హతమగుటకు
పిరికివారలు గారు మీ పీచమడప
వెడల నున్నారిదే కొండవీటి రెడ్లు.

కొండా—(కత్తిదీసి) ఓరీ! అతిక్రాంతమర్యాదా! మా సమక్షము ననే మా రాజేంద్రుని దూషించుచు మా నాశనమును సంకల్పించుచుంటివటరా! తులువా! చూడు నిన్నేమిచేసెదనో—

ఖడ్గ—ఓరీ! తులువా! ఏమిరా ప్రతాపప్రదర్శనము చేయజూచుచున్నావు? రమ్ము! మన యుద్ధకౌశలము నేడే తెలియగలదు.
(కత్తిలాగును)

కొండా—దుష్టా! వంటయింట జొచ్చిన కుంచేలు వయితి వెందు బోయెదవు? నీ పీచ మడంతును రమ్ము.

మల్లి—(కత్తిలాగి) ఓరీ? మందనుచూచి — మొరుగుచున్న కుక్క వలె మొఱిగిన నేమి లాభము? కులద్రోహివై - పూజ్యమగు రెడ్డికులంబున బుట్టియు — పట్టెడు పొట్టకోసము -రాచవారి నాశ్రయింప దలపడిన నీ నాశనమునకు ఖడ్గనారాయణుఁడు కావలయునా! రమ్ము - నా కరవాలాగ్నియందు శలభంబవై మాడిపోయెదవు.

(14 వ అనుబంధము)

వీరా—రాజేంద్రా? ఏమి యీ కల్లోలము! రాయబారంబు సలుప వచ్చిన దూతపై కలహించుట మనకు నీతిగాదు.

అన—కొండారెడ్డీ! శాంతింపుము. వీరి రాయబార మింకచాలును. వీరి నిప్పుడే పురము వెడలింపుము.

కొండా—మహారాజా! నాదొక మనవి గలదు. ఈ దుర్మార్గుడు మన రాజకీయ రహస్యములను - మనయుద్ధ ప్రయత్నములను గూఢముగ కనుగొనుటకై — యీ రాయబారమను మిషచే మన పట్టణము బ్రవేశించెను. ఈ నాలుగైదు దినముల నుండియు నితఁడు పట్టణమునందంతటను సంచరించుచు నేమేమో సంగతులు కనుగొనుచునే యుండెను. ప్రతి స్థలమునందును, ఈ మూర్ఖుడు దేవరవారిని గూర్చి ప్రసంగించుచు తమ రప్రయోజకులనియు, యుక్తాయుక్త విచక్షణ శూన్యులనియు, సింహాసనమున కనర్హులనియుఁ దమ ప్రభువే మిక్కిలి యోగ్యుడనియు, నోటికి వచ్చినట్లెల్ల కూయుచున్నాడు. ఈ రాయబారులు మా యింటనే బసచేసి యున్నందున నిన్నటిరాత్రి రెండు జాములకు, మేడపైనున్న గదిలో - నిద్రలేకుండ కూ

ర్చుండి వీరు మాటలాడుకొనిన మాటలను నేను రహస్యముగ వింటిని. అప్పుడు నా గుండెలు పగిలిపోయినవి. వీరు సామాన్య రాయబారులు గారు. పట్టపగలే - బహిరంగముగ కన్నము త్రవ్వగల గజదొంగలు. వీరిని సామాన్యముగ విడిచిపెట్ట రాదు.

మల్లి——(కత్తిదూసి) ఓరోరి యసత్యవాదీ ! నిత్యపాతకవర్తీ! ఏమను చుంటివిరా!

మ. తులువా! యేమనిపల్కితీవు? దురితాత్మ్మ మేనవేలిందు నీ
బలగంబు ల్గలరంచు మత్తిలి యసంభావ్యంబు లిట్లాడెదే !
ఖలుడా! నీ శిర మిప్పుడే తరిగి రక్తస్రావముం జేతు నీ
స్థలమే ప్రేతతలంబు గావలయు ; వంశద్రోహి! పాపాత్ముడా !

ఖడ్గ——(పట్టుకొని) మిత్రమా ! తొందఱ పడకుము.

అన——కొండారెడ్డీ ! నీ స్వామిభక్తికి సంతసించితిమి. ఇంక మారాడక నీ మల్లినాధుని పురమునుండి వెడలగొట్టి ఖడ్గనారాయణుని బట్టి బంధింపుము.

ఖడ్గ——తులువలారా! మమ్ము బంధింప మీ తరమగునటరా ! రండు మిమ్మందరను మే మిరువురమే భూతబలి యిచ్చెదము. (అందరును యుద్ధముచేయుదురు. ఖడ్గనారాయణుని పలువురుబంధింతురు. (తెర వ్రాలును.)

## 2 వ రంగము — వీరారెడ్డి యిల్లు

వీర—(15 వ అనుబంధము)

అన్న——అమ్మా ! వీరభద్రా ! ఊరడిల్లుము.

వీర——అన్నపూర్ణా ! నా మనోరథమును, నాశరీరమును, నా యావ

నమును నే నమ్మహనీయునకు ధారవోసితిని. ఎన్ని కష్టములు సంభవించినను నా కాతఁడే హృదయప్రియుడు. అతడే నా దైవము. లోకమంతయు నాకాతనితోడనే యున్నది. ఆ మంగళాకారుని చరణకైంకర్యము నాకు లభింపనినాడు నే నీ తుచ్ఛలోకము నుండి తప్పక విముక్తి చెందెదను.

అన్న—అమ్మా! నీవు మహాపతివ్రతవు. నీవంటి సాధ్వీమణికి సర్వేశ్వరుఁడట్టి ఘోర విపత్తుఁగల్గింపఁడు. ఆపత్సమయమున, ధైర్యము వహించుటయే కార్యమునకు శుభసూచకము. విషాదనమ్రవై — నిరంతరము నిట్లు — శుష్కించుచున్న యెడల కార్యసాధనోపాయమును, మనకెఱిఁగించువారెవ్వ రున్నారు? నీవించుక ధైర్యము వహించునెడల నేదోయొక మార్గ మాలోచించి వానిని బంధవిముక్తు నొనర్చుటకు ప్రయత్నింపవచ్చును.

( 16 వ అనుబంధము )

వీర—చెలీ! దాప నేల?

సీ. నాజీవమగు ఖడ్గనారాయణు నిస్వజీ
వములతో నాకుఁ గన్పరుపరమ్మ!
ఘోరవకా—నీవిపత్కారణంబున ప్రాణ
ములను వీడునో యేమొ తెలుపరమ్మ!
అనఘాత్మ! నీదాసియగు వీరభద్ర నీ
పై బెంగఁగొనెనంచు బలుకరమ్మ!
మహినీవిముక్తికి మార్గంబుగలదేని,
జీవమిచ్చెదనంచుఁ జెప్పరమ్మ

గీ. కాంతు నిడుమలు తీరు మార్గంబు వెదకి
తెరవు నీకిదియంచు బోధింపరమ్మ

చేతగాదేని యిపుడె నిశ్చింతబూని
వీరభద్రిపైని దురాశ వీడరమ్మ !

అన్న—అమ్మా ! ఇప్పుడు నీవిట్లు దుఃఖింపక కార్యముదెస దావవు గమ్మ. ధీరుడగు ఖడ్గనారాయణుఁ డెన్నడును కష్టములకై మనోధైర్యము చెడి ప్రాణత్యాగ మొనర్చువాడుగాడు. విన ను — నేనీ సాయంత్రిము లోపల నెట్లో కారాగృహమున కేగి, ప్రస్తుత మాయనకు ధైర్యము గఱపి వచ్చెదను. నీవును నొక లేఖ వ్రాసియిమ్ము. దానిం గొనిపోయి యాయన కిచ్చె దను.

వీర—చెలీ ! నా కింతకన్న నేమి కావలయును? అట్లే వ్రాసియిచ్చె దను. యిప్పుడే యారంభింతును.

( ఇద్దరు నిష్క్రమింతురు )



## 3 వ రంగము

### రాచకొండ వీధిలో

( వెంకన్న - అన్నపూర్ణ చెఱియొకవైపునుండి ప్రవేశము )

వెంక—ఓహో ! అన్నపూర్ణా ! ... నే నెంత యదృష్టవంతుడనే ! ఇంతవరకు నా మనస్సులో నిన్నుగూర్చియే— యాలోచించు చున్నానుసుమా ! నిజముగా నేను సంకల్పసిద్ధుడను.

అన్న—తాతా ! నీవు సంకల్పసిద్ధుడవు. స్మశానసిద్ధుడవు.

వెంక—అదిగో ! నన్ను తాతా యని పిలువవలదని నీ కెన్నిసారులు చెప్పినాను? నా గ్రహచారము కాలా— పట్టుమని యింకను నాకు నలువది యేండ్లయినను నిండలేదు. అప్పుడే తాతానై

పోయినానా ? నా దంతములు చూడు. ఎంత పటుత్వముతో నున్నవో ? నా దండలుచూడు- ఎట్లు తిరిగియున్నవో—

అన్న—తాతా! వానిమాటకేమిగాని, నీ తలవెండ్రుకలకు తారు పూసితివా యేమి? మొన్నటి కన్నను నేడు నల్లగా నున్నవి.

వెంక—అన్నపూర్ణా! తెల్లవారినది మొదలు గిట్టని ముండకొడుకు లందరును నన్నిట్లే వేళాకోళము లాడుచుందురు. నీవుగూడ వారిలోఁ జేరితివా? యేదీ! నీ ముద్దు మొగ మొకసారి పైకెత్తి — నా శరీరమును చక్కగాఁ జూడు. నేనెంత యందగాఁడనో నీవే తెలుసుకొనఁగలవు.

( 17 వ అనుబంధము )

అన్న —నీ యందము కాలినట్లే యున్నది. నీ బ్రతుకునకుఁ జక్కదన మొకటి యుండవలెనుగా?

వెంక—అయ్యో! అట్లనియెదవేల? నీవంటి సుందరి నాకు భార్యగా నుండ నాకుఁగాక మరి యెవ్వరికి చక్కదనము?

అన్న—ఛీ! నోరుముయ్యి—ఆ ప్రేలాపన కట్టిపెట్టవలయునని నీకెన్ని మారులు చెప్పితిని.

( 18 వ అనుబంధము )

వెంక—ఔను నేనేమి చేయఁగలను? నీవు సమ్మతింపకున్న—బలవంతముగ నైన-నెత్తుకొని పోయెదను గాని, యీ విషయములో నీవెంత చెప్పినను నేను వినను.

అన్న—ఛీ! మూర్ఖుడా! నీకు సన్నిపాతము ముంచినప్పుడుగాని, నీ నోరు మూతపడదు.

వెంక—నాకు సన్నిపాతము, ముంచినప్పుడు నీకేది దారి? నీ వెట్లు బ్రతుకగలవు? అన్నపూర్ణా! ముసుగులో గుద్దులాటలెందుకు?

(5)

స్పష్టముగా వినుము. నీ మనస్సింకను మారకున్నది.—రాత్రి భోజనమైన తరువాత, నీ యింటికి వచ్చి బోధ పరచెదను. అప్పుడు నీవు ... ...

అన్న—నీ పరువునకుఁ దోడు మా యింటికిగూడ రావలెనా? అట్టి పని యెప్పుడును చేయకు. కాళ్ళు విరుగగొట్టఁగలను.

వెంక—ఆహా! అన్నపూర్ణా! నీవట్లు చేసిన యెడల నిజముగా నాకు మహోపకారము సల్పిన దాన వగుదువు. కాళ్ళు విరిగి నేను నీ యింటనే పడియున్నప్పుడు—నీవే నన్నెత్తుకొని, మంచముమీఁద బరుండఁబెట్టుటయుఁ సంభవించును గదా! ఆహాహా! అప్పుడు నేనెంత అదృష్ట వంతుడ నగుదును!—అట్టి భాగ్యమే నీవు నాకుఁ కల్గించిన యెడల—నేను తప్పక నేటి రాత్రి—నీ యింటికి వచ్చెదను. నీవుమాత్రి యొక చేపాటి కర్రతో గుమ్మమువద్ద సిద్ధముగా నుండుము.

అన్న—ఓరీ! సిగ్గుమాలిన శిఖండీ! నీకు వచ్చిన యీడెవ్వరికి వచ్చినదిరా! ఛీ! నడు వీధిలో నవ్వులాటలా!—నడు—నడు—

(19 వ అనుబంధము)

(ఇద్దరును - నిష్క్రమింతురు)

## 9 వ రం గ ము

(రాచకొండలోని చెరసాల)

ఖడ్గ—(20 వ అనుబంధము)

వెంక—ఫారాహుషార్! ఫారాహుషార్!!

అన్న—(షవే) (తనలో) అల్లదే సుకుమారుఁడగు ఖడ్గనారాయణుఁడు. కారాగృహ వాసంబున మలినమయిన ముఖమండల

ముతో దుఃఖించుచున్నవాఁడు. నే నీ మద్యము నీ కారాగృహ రక్షకున కొసంగి మత్తునిఁ జేసి వీరభద్రి యుత్తరము నీ ఖడ్గనారాయణున కొసంగెద గాక!—

వెంక—వహ్వా! వహ్వా! రామచిలుక! బంగారు మొలక నన్ను పెండ్లాడడాని కొస్తూంది. రా–రా–మోహినీ–రా–నాకొక ముద్దిచ్చి వెళ్ళు.

అన్న—(21 వ అనుబంధము) [సారానిచ్చును.]

వెంక—(త్రాగి పడిపోవును.)

అన్న—ఇదే మంచిసమయము. (తాళముతీసి) ఖడ్గనారాయణునకు జయమగుగాక!

ఖడ్గ—అన్నపూర్ణా! ఇదేమి సాహసము! ఇట కూర్చుండుము.

అన్న—ఆర్యా! సుకుమారు లగు తమరిట్టి దుర్గంధ పూరిత ప్రదేశ ములవాసము చేయుటకే సాహసించినప్పుడు — నాయీ సాహస మొక లెక్కయా?

ఖడ్గ—అన్నపూర్ణా! నా కష్టములకేమి? మీ చెలి వీరభద్రి క్షేమ ముగ నున్నదా!

అన్న—ఆమె క్షేమము నామెచే వ్రాయఁబడిన యీ లేఖయే మీ కెరింగింప గలదు.

ఖడ్గ—అన్నపూర్ణా! వీరభద్రి నా కుత్తరము వ్రాసినదా? ఏది ఏది?

అన్న—(యిచ్చును)

ఖడ్గ—(విప్పి చదువుచున్నాఁడు)
"ప్రాణేశ్వరా!

ఉ. తిండికి నాశపుట్టదు; గతించెను నిద్దుర; నవ్వి లేదు; నా
గుండె పతాలు మంచునఁ బగుల్ నని జోవ్రు మనుండె నక్కటా
పండిన పొట్లపండువలె ప్రాణమిటుల్ క్షణభంగురంబుగా
నుండె భవద్వియోగమున నో హృదయేశ్వర! యేమిచేయుదున్.

సీ. కొండవీటికి రాచకొండ కీ శత్రుత్వ
మేకారణము లేక యేల గలిగె?
ఆరాజు నిను రాయబారిగా నియమించి
యీలీల రిపు సీమ కేల నంపె?
మాతండ్రి నీకు సన్మానంబుఁ గావించి
నీకేల మా యింట నెలవొసంగె
అక్కటా! నినుఁ జూచినంతనే, నాయంత
రాత్మ నీయందేటి కైక్యమయ్యె
దిక్కుమాలిన దైవమా తెలుఁగు నిన్నుఁ
గారలో నేల చేర్చె నిష్కరుణమతిని
ప్రాణనాయక! నీ పదాబ్జములఁ గొలిచి
నిన్నుఁ దలపోసి ప్రాణముల్ నిలుపఁజాల—

శా. కొండారెడ్డి కతాన బల్మినసువుల్ గోల్పోవ సంసిద్ధనై
యుండన్ నిన్గని మోహబద్ధనయి నే నూరంత పేరాశతో
పండెన్ మత్కృతపుణ్యమంచు మదిలో భావించితి న్నాని; యి
ట్లుండెన్ మత్కృతపుణ్యమం చెఱుఁగ లేదోయీ మనోవల్లభా!

మ. తనుఁ జేపట్టకయున్న నా బ్రతుకబద్ధంబంచు స్పష్టంబుగా
ననె నామూర్ఖుడు; నిన్నుగూడ చెఱలో నంతంబు నొందింపఁగా
గనుచున్నాఁడు; విపత్సముద్రమున, మున్గంగా దటస్థించె; నే
మనుదానన్ - మనకేమి సాధనమొ నాథా! నీవె భావింపవే!

ఉ. ఆపదలందు ధైర్యము, మహాత్ముల లక్షణ మందుచేతనే
పాపపు సాహసంబునకుఁ బాల్పడఁ బోక, భవద్భుజా బల
ప్రాపకమైన భీకరకృపాణము ప్రాణముగా ధరింపుమా
పై పని చూచుకొందము; కృపామయుఁ డీశ్వరుఁడుండు నేకదా!

ఉ. వడ్డికివడ్డిఁగట్టి తమవైరులపైఁ బగఁ దీర్చుకొంటయే
దొడ్డతనంబుఁగా దలఁచి, దోర్బలలీలల వేల్పుదొడ్డ పైఁ
బడ్డ, నెదిర్చి – నిల్వఁగల బాహు బలాఢ్యులు రెడ్డిరాజులా
రెడ్డి కొలంపు బిడ్డఁడు, ధరించిన శస్త్రము రిత్తపోవునే!

క. చండాఖడ్గశతాసిని,
చండాలుఁడ ఖర్వగర్వసంపన్నుండా
కొండారెడ్డిని గ్రక్కున
ఖండింపుము: జంకులేక; కంటంబడినన్.

శా. కారాగార విముక్తుఁజేసి నినునేకష్టంబులేకుండ మీ
యూరంజేర్పఁగఁ బెక్కుమార్గములనే, నూహించుచున్నాను; నీ
వైరుల్ నవ్వఁగ నాత్మహత్య కెపుడుం బాల్గాకుమీలోపలన్
కారుణ్యాలయుఁ డీశ్వరుండె మనలంగాపాడు; ప్రాణేశ్వరా!
ఇట్లు—నీచరణసేవకురాలు వీరభద్ర"

అన్న—దేవా! మాచెలి సంతాపాతిశయము నీలేఖయే మీకు విశదము
చేయఁగలదు.

ఖడ్గ—(వీరభద్రనుద్దేశించి) వీరభద్రా! నిన్ను వీక్షించినదాది, నీ
యనన్యసామాన్య రూపలావణ్యాతిశయమునకే – యుప్పొంగు
చుంటినిగాని, యిలత ప్రతిభావంతురాలవని, నే నెఱుంగను
సుమా! కార్యాలోచనమునందును సూక్ష్మగ్రహణశక్తి

యందును, నీవప్రతిమ ప్రజావతివి నీవు వ్రాసిన యీ యుత్తరము వేనోళ్ళఁ జాటుచున్నది. మనోహారిణి ఏమందువు?

"......... విపత్సముద్రమున్గంగాఁ దటస్థించె నేమనుదానన్ మనకేమి సాధనము - నాథా నీవె బోధింపవె" అనియా? సుందరి! ఏమిసాధనమున్నది? దైవమే మనకిఁక సాధనము. ఆశ్రితజనవత్సలుండగు, సర్వేశ్వరుఁడు నిరపరాధుల దండింపడు. నీచులచే దండింపఁబడనీయఁడు, అందుచేఁ బరమేశ్వర చరణస్మరణమే మనకిప్పుడు శరణము.

'కొండారెడ్డిని గ్రక్కున
ఖండింపుము; జంకులేక కంటంబడినన్'

తలోదరీ! ఖడ్గనారాయణుఁ డిప్పుడుఖడ్గవిహీనుఁడై యున్నాఁడు. లేనిచో - చండాలుఁడగు కొండారెడ్డి యింతకాలము ప్రాణములతో నుండునా? ఆ భీతచిత్తుడు ప్రాణభయముచే-నా కరవాలము నూడఁబెఱికి, నిరాయుధుఁ జేయుటచేతనే వాఁడు చిరాయువై యున్నవాఁడు.

"......వైరుల్ నన్వేఁగ నాత్మమాత్య కెప్పుడున్
బాల్గాకుమీలోపలన్
కారుణ్యాలయుఁ డీశ్వరుండె మనలన్
గాపాడు, ప్రాణేశ్వరా!"

సుందరీ! నీవు నాకపరిచితవగుటచే నాసంగతి నొక్కింతయు నెఱుంగక యిట్లు వ్రాసితివి. ఐననేమి? ఇమ్మంగదభాగ్యుని యందు నీకుదృవించిన మోహాతిశయమే నీచే నిట్లు వ్రాయించినది. కాని పౌరుషప్రధానులగు రెడ్డివీరుల నిర్వక్రవిక్రమాతిశయములు నీ వెఱుంగనివికావు. ఇప్పుడేకాదు. దివాకర నిశాకర తారకాగణములున్నంతవరకు-రెడ్డివీరులకుఁబుట్టిన

ముద్దుబిడ్డఁడు ముక్కున నూపిరియుండుదనుక—సంగ్రామ రంగంబున నెట్టి శాత్రవునైన నెదిరించి నిల్చునుగాని పిఱికి పందవలె నాత్మహత్యకుఁ బాల్పడునా? ఇంకఁ గొండారెడ్డి గాని—వానిప్రభువగు ననపోతనాయఁడు గాని నన్నేమి చేయఁ గలరు? ఇట్లెంతకాల మీచెఱలో నుంచెదరు! ఆనీచులు కేవలము పౌరుషహీనులగుటచేత నే బహిరంగముగ రణరంగ మున నన్నెదిరింపలేక - నిరాయుధునొనర్చి యిట్లు బంధించి నారు. కావుననే వలలోఁజిక్కి - మహోగ్రహాసముదగ్రమగు నీరెడ్డిసింగము తన్నుచుట్టిచరించు శత్రుమదవేదండంబులఁ గన్నాఱఁ గాంచియు నూరకుండవలసి వచ్చెను.

అన్న—ఆర్యా! ఉత్తరమంతయు సావకాశముగఁ బరిశీలించినారా! మీ రేవిషయమునుగూర్చి యంతదీర్ఘముగా నాలోచించు చున్నారు.

ఖడ్గ—అన్నపూర్ణా! మీ యజమానురాలు నాకీ యుత్తరము నేల వ్రాసినది?

అన్న—అయ్యా! ఉత్తరమంతయుఁ జూచియు మీరిట్లడిగిన నే నేమనఁగలను? ఆ యుత్తరము మీకు బోధపడినదా?

ఖడ్గ—ఉత్తరము నాకు బోధపడినది. గాని నేనన్నమాట... నీకు బోధపడలేదు. నాహృదయమును మఱింత కలతఁ బెట్టుటకు వీరభద్ర, యీ యుత్తరమేల వ్రాయవలయునని యడుగు చున్నాను.

అన్న—ఆలాగుననా! మీ హృదయమును గలతపెట్టవలయునని, యామె యనుకొనలేదు. మీకు మనశ్శాంతి యగునని యెంచి- యీజాబు వ్రాసినది.

ఖడ్గ—అన్నపూర్ణా! అటులైనయెడల నా యపరాధమును క్షమి

యింపుము. నేను తప్పుదలంచితిని. నిశ్చయముగ ... నీ యుత్తరము నా సంతాపమును ద్విగుణమొనర్చినది. మొదలే ... దీర్ఘవిచారమున శుష్కించుచుండిన వీరభద్రికు, నేను మఱింత సంతాపమును గలిగించుచున్నాను. మందభాగ్యుఁడగు నాయం దింతయనురాగమును వహించుటవలన నామె కేమి ప్రయోజనమున్నది!

అన్న—ఏమో ... నాకేమి తెలియును? ఇంతకు నీశ్వరేచ్ఛ యెటులున్నదో గదా!

ఖడ్గ—పోనిమ్ము అన్నపూర్ణా! నా విషయమై వీరభద్రి యేమి యేర్పాటు చేయుచున్నది? నన్నిందునుండి యెట్లు తప్పింపగలదు?

అన్న—యిప్పటి కేమియు స్ఫురింపకున్నది. ఐనను ... కొన్ని దినములలో—సింగభూపతి జన్మ దినోత్సవము జరుగనున్నదిగదా!

ఖడ్గ—జన్మదినోత్సవమా! అన్నపూర్ణా! ఈ యుత్సవమును మీ రాజు మిక్కిలి వేడుకగా జరిగించును కాఁబోలును.

అన్న—ఔను. ఆనాడు పట్టణమంతయు సంపూర్ణోత్సాహముతో నుండును. దూరదేశములనుండి సైతము పెందరో ... యీ యుత్సవమును చూచుటకు వచ్చుచుందురు.

ఖడ్గ—ఆహా! అన్నపూర్ణా! నీవీమాటలు చెప్పుచుండ నెందుచేతనో నా కుడికన్ను అదురుచున్నది. ఈశ్వరుఁడు మన వీరభద్రి ప్రయత్నమును కొనసాగించును గాఁబోలును.

అన్న—ఆర్యా! ఈశ్వరానుగ్రహమున నిట్లే జరుగుగాక!

ఖడ్గ—అన్నపూర్ణా! ఈ యుత్తరమునకుఁ బ్రత్యుత్తరముగా వీరభద్రి కేమి చెప్పవలయునో తోచకున్నది. అందుచే నామెకు నా నమస్కారములను మాత్రి మెరిగింపుము.

అన్న—అయ్యా! పిన్నలకు పెద్దలు నమస్కరింప వచ్చునా?

ఖడ్గ—పోనిమ్ము—నేను నిరంతరముగా నామెకు చరణదాసుడనని చెప్పుము.

అన్న—అట్లు చెప్పినచో- నామె మనస్సున నొచ్చుకొనకమానదు.

ఖడ్గ—ఆలాగుననా? సరే! ఆమె సుందర వదనారవిందమును నేనొక సారి ముద్దు పెట్టుకొంటినని చెప్పుము.

అన్న—అట్లే చెప్పెదను గాని, అందువలన మీ ధైర్యస్థయిర్యము నామెకు తెలియఁగలవు. మరియుఁ బురుషులు మోహాతురు లని యామెకు స్పష్ట మగును.

ఖడ్గ—అదియును వలదా! కానిమ్ము. నీవు వ్రాసిన ప్రకారము నీ యాజ్ఞ శిరసావహించి, యాత్మహత్యకుఁ బాల్పడక—నేను ధైర్యముతో నుండెదనని చెప్పుము.

అన్న—చెప్పెదను. గాని యిందువలన, మీ యుత్తమ నాయకత్వ మును వీరభద్రి యాక్షేపించిన యెడల నేనుమాత్రి ముత్తర వాదిని గాఁజాలను.

ఖడ్గ—అబ్బ—అన్నపూర్ణా! నీతో మాటాడుట కష్టము సుమా! నీ వేమియుఁ జెప్పనక్కరలేదు. ఈ ముద్దుటుంగరమును— గైకొని యామెకుఁ బ్రత్యుత్తరముగా నర్పించితి ననుము. (ఇచ్చును)

అన్న—సెబాస్! అది కదా వీరపురుషుల లక్షణము. దూరార్థ బోధకమగు ప్రత్యుత్తర మింతకన్న వేరేమున్నది. ఆర్యా! నా కింక సెలవిప్పించెదరా?

ఖడ్గ—శుభం బగుగాక! పోయిరమ్ము.

(అన్న—నిష్క్ర—తెరవ్రాలును)

## 5 వ రంగము

### పురవీధి

(వెంకన్న ఒంటరిగ ప్రవేశించును.)

వెంక—(అనుబంధము 22)

మొన్న మొన్ననే అరవై యేళ్ళుదాటి పదేళ్ళు పయిన పడినవి గదా? నా కప్పుడే యేమంత ముసలితన మొచ్చిందని తాత నౌతాను? అసలు "తాత" అనేమాట కర్థమేమిటి? మనుమళ్ళు, మనుమరాళ్ళు ఉంటేగదా తాతని గావడం... నా కింకా పెళ్ళేకాందే! ఇంతలో తాతనౌతానా? పరిహాసాలాడి పారిపోవడమే గాని వొక్కముండా పట్టుమని పెళ్ళాడదు మనదు గదా! వీళ్ళకేం పోయేకాలమో గాని వెండితీగల్లాగ వెండ్రుకలు మెరుస్తూ ఉంటే—అందము తక్కువట! నల్లగా మసిబొగ్గుల్లాగా ఉంటే నాణ్యమట! మొన్న అన్నపూర్ణ యీదారిని వెళుతూ కాస్త నామీద కన్నువేసింది. కాని మళ్ళీ కనపడ్డది గాదు. ఎవరు చెపుమా! ఈదారిని రింగురింగు మంటూ వస్తున్నారు? అన్నపూర్ణ కాదుగదా! ఐనా— వీళ్ళంతా అన్నట్టుగానే - నాకు, దృష్టిలోప మున్నమాట వాస్తవమే. (సరిగా చూచి) ఆ! ఈసారి చూపు బాగా అనుతూంది. ఇది దివాణపు దాసి మాలి. బాగుంది. పోసీ అన్నపూర్ణమాట మరచిపోతాను. ఇదైనా - కనికరిస్తుందేమో—

(మాలి ప్రవేశము)

మాలి—వెంకన్న తాతా! ఎక్కడికో వెళుతున్నావూ?

వెంక—ఓసీ! చెడిసెముండా! అన్నావూ! ఆ మాటకాస్తా అనేశావంటే - నీ కళ్ళకు నే నెంతలో తాతనై పోయినానే?

మాలి—తాతా! నిన్ను తాతా అంటే అంత కోపమెందుకూ?

వెంక—అదుగదుగో! మళ్ళీ తాతా అంటున్నావు? నా వొళ్ళు మం
డుకు పోతుంది.

మాలి—మరి నిన్నేమని పిలువ మన్నావు?

వెంక—ముద్దుగా బావా అని పిలవరాదఁటే!

మాలి—ఓరి నీముద్దు ముక్కలుగానూ- సరేగానీ, బావా! ఇప్పు డె
క్కడికి వెళుతున్నావో చెప్పావు కాదుగదా!

వెంక—సెబాసే మరదలా! ఇప్పుడు బాగుంది. నీ నోటినుంచి మంచి
ముత్యాలు రాలినట్టుంది. ఐతే నే నెక్కడికి వెళుతున్నానో
చెప్పమంటావా? చెప్తాను. రేపు—మన ప్రభువుగారయిన
అనపోతరాజుగారి తండ్రి జన్మ దినోత్సవమని తెలియునా?

మాలి—వూరంతా—యింత శృంగారంగా—అలంకరిస్తూండగా—
అంతమాత్రమైనా తెలుసుకోలేనా?

వెంక—ఈ వుత్సవం రోజున గలిగిన ఆనందమువలన — ఇప్పటికి,
ఖైదులో ఉన్నవాళ్ళ నందరిని రేపు రాజుగారు విడుదల
చేయడానికి నిశ్చయించుకున్నారు. కొండవీటి యువరాజైన
ఖడ్గనారాయణుడిని గూడా వదలివేయమని చెప్పడానికి ఫర
మానా తీసుకొని వెళుతున్నాను. ఐతే—సరేగాని, మాలీ
నామాటేం జెప్పావు?

మాలి—నీ మాటేమిటి?

వెంక—ఓసీ! తెలివితక్కువదానా! "బావా" అని నీచేత పిలిపించు
కొని నేను "మరదలా" అని పిలిచిం దెందుకనుకున్నావు?
నిన్ను నేను పెళ్ళాడతా,

మాలి—వద్దు—వద్దు. ఐతే ఆ వరస మానివేయి. నన్ను "అత్తా"

అని పిలుస్తూవుండు. నిన్ను నేను అల్లుడా అని పిలుస్తాను. నాకు బిడ్డపుడితే నీ కిస్తాలే...

వెంక—అప్పటికి నేను చస్తే!

మాలి—చస్తే తగలేస్తారు.

వెంక—ఓసీ! దిక్కుమాలిన దానా! నేను చావవలెనంటే?

(తెరలో)

మ. అరరే యెంతటిమోసమయ్యో! ఖలుండౌ నా ఖడ్గనారాయణుం డిరవొందం జెరసాలనుండి చనునే? స్వేచ్ఛాను మోదాత్ముడై గురు తంత్రంబు రచించి కార్యఫల భగ్నుంజేసి - మర్దింతు-నే నరు, డోర్వం గలవాడు? వైరియగు, కొండారెడ్డి జీవింపగన్.

మాలి—[భయముతో) అమ్మయ్యో! అదియేమి గంభీరనాదము?

వెంక—అదుగో! కత్తిదూసికొని, యార్చుచు దుష్టుడగుకొండారెడ్డి యిటే వచ్చుచున్నాడు. రమ్మురమ్ము ప్రాణములు రక్షించుకొందము.

(మాలి నెత్తుకొని పరుగెత్తును.)

6 వ రంగము

(మందిరాంతర్భాగమున]

[క్రోధముతో, కొండారెడ్డి పూర్వోక్తపద్యముల జదువుచు ప్రవేశం]

కొండా—ఎంత దుర్మార్గుడు! ఎంత కుతంత్ర పరాయణుడు! ఈ రహస్యము నాకు తెలియకుండిన ఎడల నాకస్మికముగ, నా పెంప మునిగిపోవును గదా! నా ప్రయత్నము లన్నియు గంగలో కలసిపోవును గదా! తాను స్వయముగ మనవి చేసిన యెడల గార్యము లేదని తలంచి మా మామ ఛీఛీ! వాడు నా కెక్క

డి మామ! ఆ వీరారెడ్డి యెవరిచేతినో యీ సంగతి రాజునకు జెప్పించి యుండును. ఐనను — యెవనిచేఁ జెప్పించి యుండును? ఉత్సవమునాడు కారాగృహమునందున్న ఖైదీల నందరను—విడుదల చేయుట రాజధర్మమని, ప్రధానమంత్రులలోనే — యెవరో ఒకరు — జెప్పవలసి యుండును. కాని వారందరును — ఖడ్గనారాయణునియందె మితిలేని రోషము వహించి యున్నారుగదా! అట్లు చెప్పియుందురా! కాదు కాదు... ఎంతమాత్రము నిది వారిబోధన కాదు. కాక మరి యెవరిది........ ఇట్టి రాజకీయాంశము లితరోద్యోగస్థులెవరు బోధించినను రాజు వినడు గదా! నిన్న సాయంకాలమున కొల్వుకూటములో రాజుగారి యెదుట జరిగిన యుత్సవప్రసంగములో ఖయిదీల విషయమై ప్రశంసయే రాలేదు. మరియు నిన్న రాత్రినుండియు రాజు దేవిగారి యంతఃపురమునందే యున్నట్లు వినుచున్నాను. పరపురుషులు చొరరాని యంతిపురి సీమకేగి యీ విషయమై రాజున కెవరు బోధించెదరు? రేపుత్సవ దిన మగుటచే — ఖయిదీల నందరిని విడిచి పెట్టవలయునని — యింత యాకస్మికముగ నుత్తరు విచ్చుట కేమి కారణము? ఈ బుద్ధి రాజునకు స్వయముగ బుట్టినదా! లేక బలవంతముగ నితరులు పుట్టించిరా? స్వయముగాఁ బుట్టిన బుద్ధియే యైనచో ఖడ్గనారాయణుని యందింత యాగ్రహముతో నున్న యాతడు వానినిఁ దప్ప దక్కిన ఖయిదీలను మాత్రము విడిచిపెట్ట వలయునని యాజ్ఞాపించి యుండడా? అందుచే నిది తప్పక పరబోధితమే గాని, స్వయంకృతాపరాధము కాదు. కాని యీ బోధించిన వారెవరో కుతంత్రములందు నాకంటెను నేర్పరులై కనంబడు చున్నారు.............. కారణ మేమియో తెలియరాదు. కాని నేటికి రెండు దినములనుండి కోటలోని చాళుక్య రాజకన్యకయగు నీలయను దాసి

మా యింటికి వచ్చి - వీరభద్రాన్నపూర్ణలతో నేమేమో గుసగుసలాడి పోవుచుండుట - నేను కనిపెట్టుచున్నాను. ఆ గుసగుస లేవిషయమును గూర్చియో గదా! ఇదివర కెప్పుడును ఆమె మాయింటికి వచ్చునాచారము లేదే? ... ఓహో తెలిసినది. తెలిసినది. అబ్బా? ఎంత వ్యూహమును బన్నిరి. నేను మిక్కిలి మేధావంతుడ నగుటచే గ్రహించితిని గాని మరియొక మందబుద్ధియైనచో నూరకుండ వలసినదే గదా? ఈ కుట్రిలో నొక్క వీరారెడ్డియేగాక, వీరభద్రాన్నపూర్ణలు గూడ నున్నారు. ఈ ముగ్గురును గలసి యోచించి నీలను రప్పించి యామెకీ విషయమును బోధించియుందురు. ఆయుపాయము ననుసరించి - నీల తనతోగూడ చాళుక్య దాసీ లందరి తోడ నీ సంగతి నొక్కి చెప్పి యుండును. వారందరును గలసి, పట్టపుదేవి కీ సంగతి తలకెక్కించి యుందురు. ఆ చెప్పుటలో ఖైదీల నుత్సవ సమయమున విడిచిపెట్టుట, రాజధర్మమనియు, తమ తండ్రిలు రాజ్యమేలు సమయములో నటులే విడిచిపెట్టుచుండిరనియు,—— నుత్సాహ దినములలో ఖైదీలమంగళకరముగ రోదనము చేయుట రాజునకు శ్రేయస్కరము గాదనియు —— రాణికి మనస్సు నొప్పిగల్గునటుల చెప్పియుందురు. తోడనే యామె భర్త నీ విషయమున మిక్కిలి బలవంతపరచి యుండును. ఓహో? ఎంత కపటాటోపము? ఎంత నిగూఢ ప్రియత్నము? ఖడ్గనారాయణుని చెరలోనుండి స్వేచ్ఛగా విడిచిపెట్టిన యెడల నా మాయలమారి ముండకొడుకు వీరభద్రిను నాకు దక్కనిచ్చునా? ఇంతటి కుట్రిలు పన్ని నేర్చిన యన్నపూర్ణయు, వీరారెడ్డియు వీరభద్రిను వానివెంట బంపివేయ కుందురా? అందుచే నా కిప్పుడు కర్తవ్యమేమి? రాజునకు బోధఁజేసి వాని మనస్సు త్రిప్పి- యీ యుత్తరువు రద్దు చేయింపఁ బ్రియత్నించుట కవకాశము లేశమును లేదు. తెల్ల

వారినచో ఖైదీలను విడువక తప్పదు. కావున నింకొకటియే కర్తవ్యము.ఇప్పట్టున సాహసము వహించినగాని కార్యముకొన సాగనేరదు. సెబాస్! ఖడ్గనారాయణా! నిన్నుగూర్చి యెందరు బ్రియత్నించినను గార్యము లేకపోయినది. నీయాశ లడుగం టుచున్నవి. నీ జీవితకాల పరిమితి యగు నీ రాత్రిమాత్రము నీవు వృధాపుచ్చక రామనామస్మరణ చేసికొనుచుండుము.

(23 వ అనుబంధము)

[నిష్క్రమించును]

—o—

7 వ రంగము

(సింగభూపతి యాలయము)

(సింగభూపతి విగ్రహమున కెదురుగా అనపోత మాధవనాయలు పూజించుచుందురు.

అన—సోదరా! మాధవా! ఇది మన జనకుని జన్మదిన మగుటచేత పితృ ప్రతిమానమగు నీ విగ్రహమునకుఁ బూజాభిషేకంబు చేయుట మనకుఁ గర్తవ్యము. వీరులను దైవసమానముగా బూజించుట భారతజాతికి గర్తవ్యమై యున్నది.

చ. దివమున కేగియున్న జగతీవరుఁడౌ జనకుండు సుప్రమో
ద వహుఁడుగాగ పౌరులు ముదంబున వేడుకల న్మనంగ శ్రీ
భవమగు భారతావనికి బంధురకీర్తి జెలంగఁ జేసి నే
డవిరళ భక్తి యుక్తి ననుజా! సలుపందగు వీరపూజలన్.

అందరు—జయ్! శ్రీ సింగభూపతికి జయ్!

(తెరలో మంటలు)

[మరలఁ దెరలో కోలాహలము]

ఓహో!—పౌరజానపదులారా! స్వామిభక్తి పరాయణులారా! లెండు లెండు—మన కొంపలు మునిగిపోయినవి. మన పట్టణము పరశురామప్రీతి యగుచున్నది. ఉపద్రవము? గొప్ప యుపద్రవము—త్వరపడుఁడు — పురమంతయుఁ గాలుచున్నది. ఈ వృత్తాంతమును మహారాజున కెరింగింపుడు.

అందరు—(భీతిల్లుచున్నారు.)

(మరలఁ దెరలో)

ఉ. ఓరి దురాత్ములార! వినుఁడో యవనీపతులార! యేదెసం
బారెద రిప్డు డీపుర మపార భయానక కీలికీలమా
లారుణదీప్తి భస్మమగు నంత్యము దాపురమయ్యె నేటితో
కోరిమొనర్చు పాపములకుం దగు నిష్కృతిగల్గు నేటితోన్.

అన—మిత్రులారా! ఎవ్వని యుపాలంభ వాక్యములివి? ఏ నృశంసున కీ యానంద దృశ్యమునకుఁ గన్నులు మండెను? ఏ శాత్రవుండు మన పురంబును భస్మీపటల మొనరింప సమకట్టెను? అద్భుతముగా నున్నదే!

[తెరలో మరల కోలాహలము]

మాధ—సోదరా! ఇప్పుడీ మాటలతోఁ గాలయాపనము చేయుట కెడములేదు. నేను పరిజన సమూహముతోఁ జని యీ యుపద్రవ మణంగు వెఱవూహించెదను. పరిజనులారా! లెండు. ఆలసింపకుడు. మీరందరును మాతండ్రితాతలనాటినుండియు మమ్ముగొలిచి మీకుటుంబములతో సుఖముగా వర్ధిల్లుచున్నవారు. సకల విభవోపేతమగు నిప్పురంబింతకాల ముపద్రవ రహితముగ విరాజిల్లెను. మీస్వామి విశ్వాసము నీ తరుణమునఁ జూపకున్న నేమిఫలము?

అందరు——(24 వ అనుబంధము)

(మాధవనాయఁడు పరివారముతో నిష్క్రమించును.)

అన——కటకటా! ఎట్టిపురరాజమున కెట్టిగతిపట్టినది! అత్యున్నత గగనచుంబిత సౌధాగ్రము లనలాహతులందు మండి క్రిందికి దిగజారి మసియైపోవుచున్నవి. ఆహా! నా కన్ను లీ దారుణ మును గాంచి సహింపకున్నవి.

సీ. అంబరోన్నత సుధా హర్మ్యవితానంబు
లనలభీషణదీప్తి నంతమొందె-
సుందరప్రముదిత శుద్ధాంతభాగంబు
లగ్నికీలలలోన నణఁగిపోయె-
శాత్రవ దుర్భేద్య జటిలసత్ప్రాకార
రాజియంతయు భస్మరాసియయ్యె
మించినవేడ్క- నిర్మించినట్టి సదలం
కారంబు లన్నియుఁ గాలిపోయె-

గీ. కడుపులోనిచల్ల కదలకవర్థిల్లు
ప్రజలకెట్టి దుఃఖభారమయ్యె
రాజితాసమాన రాచకొండపురంబు
నేడు కాలి, కూలి, పాడువడియె.

ఇయ్యది-ప్రమాదజనితముగాదు. శత్రుజనకృతమగు మహాప కారము! కానిచో - నేకకాలంబున, పురమంతయు, భగ్గున మండిపోఁవఁగలదా! ఎవ్వరో - దురాత్ము లట్లొనర్చిరి. ఎవ్వరో యని సంశయగ్రస్తుండను కానేల? నాకు దొలుత నుండియు, గర్భశాత్రవులగు రెడ్లే-యింతపని చేసియుందురు. సంశయములేదు - ఓరోరి దుష్టులారా! రెడ్డిహంతకులారా!

ఉ. పాతకులార! మాపుర మపారము, గాల్చుట పౌరుషంబె? మ
చ్ఛాత కృపాణధారలను, జావకయుందురె దుష్టులార! దు
ర్నీతిని, చోరవైఖరి నరిందమ దుష్కృతిసేయఁ బూనినా
రా! తలలూడ్తు నిప్పుడు పరాక్రమవైఖరి రండు శూరులై.

(ఛద్మవేషములతో *మల్లినాథుఁడు, భిల్లులు,
కాగడాలుపూని ప్రవేశము)

మల్లి—ఓరోరి మదాంధా! గర్వపోతా అనపోతా! నీ తండ్రి జన్మ దినోత్సవ మెట్లు జరుగుచున్నదో చూచితివా? ఇది లంకా దహనము. నీ దురుద్యమమునకుఁ దోడ్పడుటకై యీ హరి కథలు - భజనలు - సానిమేళములు - చాలవని మేమీ నాటకమునుఁ బ్రదర్శించుచున్నాము. ఛీ దురాత్మా! నీ కీ శిక్ష చాలదు. మున్ముందు నిన్నింతకన్నను మోసపుచ్చ నున్నారము జాగ్రత్తగఁ గాచుకొమ్ము పొమ్ము.

అన—ఛీ! దుష్టులారా! ఇదియా మీపౌరుషము ఆఁడువాండ్రవలె- నధమరీతి, పురదహనము చేయుటయా శౌర్యము.

మల్లి—ఓరికుటిలాత్ముఁడా? నిరపరాధియగు - ఖడ్గనారాయణుని - రాయబారియని తలంపక చెఱనిడుట పౌరుషమటరా! కుక్క- కాటునకు చెప్పుదెబ్బయేగదా యౌషధము.

అన—ప్రేలరీ! నీవెవ్వఁడవో - నన్నుఁ జూడనిమ్ము.

(బలవంతముగ ముసుగుఁదీయబోగా అందఱును అనపోతనాయని నణఁచిపట్టుదురు.)

మల్లి—విషహృదయుఁడా? నీవింక బ్రతుకఁగూడదు. నిన్ను చంపి-

---

* కన్నులుదప్ప మిగత మొగమునకు గుడ్డలు కట్టుకొనుట.

యాంధ్రరాజ్యమును నిష్కంటకముగా జేసెదను.

(చంపబోవును)

(కృష్ణరాజు దర్మవేషముతో ప్రవేశము)

కృ—[మల్లి॥పట్టుకొని] మిత్రమా! ఇదియేమిపని? ఇది మన భవిష్య త్కార్యమునకెంత యంతరాయము? పోనిమ్ము—ఈదుష్టునితో మనకేల? ఈసింగభూపతి విగ్రహమును భిన్నముచేసి యీ మందిరమునకు సయితము మగ్ని తగిల్చి పోవుదము.

[అందరు నట్లుచేసి నిష్క్రమింతురు. తెరలో మంటలు]

[అనపోతనాయఁడు వెఱగంది చూచుచుండును.]

25 వ అనుబంధము. (తెరవ్రాలును)



# ధరణికోట

రెడ్డివీరుల సంగ్రామకథ

## తృతీయాంకము

### 1 వ రంగము

(నీలగృహమునెదుట కృష్ణరాజు మల్లినాథుఁడు భిల్లులు)
(అందఱు - నీలను పట్టి యీడ్తురు)

(26 వ అనుబంధము)

కృ—ఖడ్గనారాయణుఁ డెక్కడ నున్నాఁడో చెప్పెదవా లేదా? చెప్పి వేసిన యెడల నీ కే యపాయమును లేకుండ విడిచిపెట్టెదను. చెప్పనియెడల నీగృహమును ముట్టించి మీ కందరకును సంఘ మరణముం గూర్చెదను.

నీల—అయ్యా! నన్నేల మీ రకారణముగ బాధించెదరు? నాకు ఖడ్గ నారాయణుని వృత్తాంత మేమియుఁ దెలియదు. కరుణించి నన్ను వదలుడు.

కృ—ఓసీ! గయ్యాళీ! అంతగట్టిగ నెందుల కరచెదవు? నోరుముయ్యి. మే మడిగిన సంగతి చెప్పకున్నచో నిన్నిప్పుడే ఖండించెదను.

నీల—అయ్యా! క్షమింపుడు. దిక్కులేనిదానను. అనాధను. రాజకీయ వ్యవహారములు, రహస్యములు నాకెట్లు తెలియఁగలవు? నిష్కారణముగ స్త్రీహత్య నొనర్పకుఁడు. నేనేపాప మెరుఁగను.

కృ—పోనిమ్ము. నీ భర్త యెచ్చట నున్నాడు? వాని కీవృత్తాంతము తెలియునా? ఈ రహస్య మెరింగినవారి చుట్టుపట్ల నెవ్వరైన నున్నారా?

కృ—ఛీ! ఛీ! దురాత్మురాలా! భర్త కషాయము రాకుండ బెండ్లి కాలేదని, మా యెడ బొంకుచున్నావా? ఇది యబద్ధమయిన చో...నిన్నేమి చేసెదనో చూడు. (ఒక భిల్లుని జూచి) ఓరీ! భిల్లుడా! ఆ కాగడా నిటు దెమ్ము. దీనిమొగము చూచెదను. (అందుకొని చూచి స్వగతము) భళిరే! ఏమి ఈ మందయాన సౌందర్యము! నా హృదయము నాకర్షించి, వశము గావించు కొని, దయారస సంకలితముగఁ గావించెనే! కానిమ్ము - మా ట లాడించెదను. (ప్రకాశముగ) అబలా! నీ వెవ్వరు? నిశ్చ యముగ, నొక దాసివేనా? ఖడ్గనారాయణుని వృత్తాంతము నీ వెరుగనే యెరుఁగవా?

నీల—అయ్యా! ప్రస్తుతము నేనొక దాసినే, నే నెవ్వతెనైననేమి? నన్నుఁ జంపనెంచినవారికి, నాచరిత్రముతో, నేమిపని యున్నది? ఖడ్గనారాయణుఁడు నా కాప్తుఁడు...

కృ—ఆప్తుఁడనగా? ఆతనిని నీవు వరించితివా?

నీల—శ్రీరామరామ-పాపము శాంతించుఁగాక. ఆ మహనీయుఁడు, నన్ను దన సోదరిగా మన్నించెను. ఈ పట్టణమున బ్రవేశించి నప్పటినుండియు, వాని చరిత్రము నే నెఱుంగుదును. కష్టదశ లో నున్నప్పుడు...

కృ—సుందరీ! ఇఁక చాలింపుము. నీ వెవ్వతో తెలియక, మేమొన ర్చిన యపరాధములను క్షమించి నామాట వినుము—వీరంద ఱినిఁ జూచి — నీవిఁక భయపడ నవసరములేదు. నీవు నిజ ముగ — మా ఖడ్గనారాయణున కాప్తురాలవైనచో—నీవలనఁ

గొన్ని సంగతులు మాకుఁ దెలియవలసి యున్నవి. నీ కభ్యంత రము లేనిచో — నేను లోపలికి వచ్చి — నీతో రహస్యముగ మాటాడెదను. లోపలికి రమ్ము.

నీల—చిత్తము.

(ఇరువురు నిష్క్రమింతురు)

1 పరి—నారాయణ — నారాయణా— అర్ధరాత్రివేళ, ఆఁడుదానితో సంభాషణ— నిష్పు లేకుండ కొంపలంటుకొనురా గమనిరా?

2 పరి—ఆవిడ కన్యక — ఆయన పెండ్లిగాని వాఁడు. అంటుకొనుటలో ననుమాన ముండునా?

మల్లి—ఓయీ! ధర్మచింతనుఁడగు మన కృష్ణరాజును మీరిట్లు తలంపఁగూడదు. రాచకీయమునే భాషించుచుండ నోపు—

(కృష్ణరాజు ప్రవేశము)

కృ—మిత్రులారా! వింటిరా! కొండారెడ్డి నురాగతము. ఈ కుటిల కర్ముఁడు మన ఖడ్గనారాయణునిఁ బట్టి కట్టుకొనిపోయి — భువనగిరిగండి ప్రాంతమున వధింప నీరాత్రి సముద్యోగించె నని చాళుక్యరాజకన్యయగు నీ నీల చెప్పినది. మనమింక నేమాత్ర మాలసించినను కార్యచ్ఛేద మగును. కావున నిఁక రెండు కొండారెడ్డిని ఖండించి ఖడ్గనారాయణుని రక్షింతము.

(అందరు నిష్క్రమింతురు.)

(2 వ రంగము)

(కొండపై— మూర్ఛిల్లిన ఖడ్గనారాయణుఁడును కొండారెడ్డియు వెంకన్న మొదలగువారు ప్రవేశింతురు.)

వెంక—అయ్యా! కొండారెడ్డిగారూ! మీరింత యాలస్యము చేసిన

చో జరుగవలసిన కార్యము లెట్లు జరుగును? ఎంతసేపని యీ శవ జాగరణము మేము చేయుచుండఁగలము?

కొండా—వెంకన్నా! ముందువెనుక లాలోచింపవలయును గాని నీ వట్లు కోపము దెచ్చుకొనుట న్యాయమేనా! మనము చేయ నున్న కార్య మతి రహస్యమైనది. ఇతరులకుఁ దెలిసినయెడల మనకెట్టి యాపదయైన రాకమానదు. తగిన సమయము దొరకవలయుననియే నే నింతవరకు - వేఁచియుంటిని గాని లేనిచో నేటి మధ్యాహ్నముననే - వీనినిఁ దుదముట్టించి యుందును.

వెంక—సరేకాని యిప్పుడే వచ్చెదనని చెప్పి మీరింతసేపు నెక్కడ నున్నారు!

కొండా—మన మొనర్పబోవు కార్యమునకు ముందుగా - నొకమారు కొండ నలుదిక్కుల బరీక్షించుట మంచిదని నేను బయలుదేరి నంతనే - కుడిపైపున - బర్వతముక్రిందఁ జెట్లచాటునుండి మనుష్యుల యలుకుడు నాకు వినఁబడినట్లయినది. అది నిజమో యబద్ధమో - కనుఁగొన వలయునని కొంత సేపు నిరీక్షించితిని. కాని నాకా యనుమానము మాత్రి మిప్పటికినిఁ దీరనేలేదు. ఎవరో - మనుష్యులీ చుట్టుప్రక్కల నున్నట్లు నామనస్సు సంకోచించుచున్నది.

వెంక—రెడ్డిగారూ! మీకు మతిపోయిన దేమి! ఇంత రాత్రివేళ నీ పర్వత ప్రాంతమున జనసంచార మెట్లుండగలదు? గాలిచే కదలిన యాకులచప్పుడో - గుంటనక్కల పసుగుల చప్పుడో! మీకు వృథాసందేహముగాని నిరీక్షించి - పట్టుకొని మనలను పట్టియిచ్చు శత్రువు లెవ్వరున్నారు? ఇట్టి వట్టి సంశయము లతోఁ గాలము వ్యర్థపరచినచో-ముందేమి ముప్పు రాఁగలదో!

కొండా—వెంకన్నా? - నీవు వయస్సునందేకాక - బుద్ధియందుగూడ మిక్కిలి పెద్దవాఁడవు. నేడు నీవు నాకొనరించిన మహోపకారము నేనెన్నఁటికిని మఱవఁజాలను. నీవు చెప్పినట్లు నేను వృథాసంశయముల నిఁక విడిచి - కర్తవ్యము నారంభించుట మంచిది. (ఖడ్గనారాయణుని తన్ని లేపి) ఓరీ! మదాంధా! ఖడ్గనారాయణా! వీరభద్రిను పెండ్లియాడు సంకల్పము నిన్నింకను విడువలేదు గాఁబోలును! పాపము నీ యాశలన్నియు నడుగంటినవి. ఇంక వీరభద్రా నామస్మరణ చేసికొనుము. నీ జీవితశేషమింక కొలఁది నిమిషములు మాత్రమే యున్నది.

ఖడ్గ—(లేచి) ఛీ! దురాత్మా! సిగ్గులేక పౌరుషవంతునివలె నే మొగముతో మాట్లాడుచున్నావురా? నన్ను నిరాయుధుఁజేసి నా కరచరణములను బంధించి బలవంతముగ చంపుటకు నీ కేల చిన్నతనము గలుగలేదు? నీ పౌరుష మంతయు నేగంగలోఁ గలిసిపోయినది? మీసములుగల మగవాఁడవైనచో - వీరాగ్రేసరుడవైనచో - నా బంధములు విప్పి - న న్నాయుధపాణి నొనర్చి - నా యెదుట నిలిచి - పోరాడుము- ఒక్క నీవేకాదు. ఇచ్చట నున్నవారందరు నన్నుఁ దలపడ వచ్చును. అంతియేకాని ఛీ! పిరికిపందా! ఇదియా నీ పౌరుషము? నీ వలెనే ప్రాణములన్న నాకింత తీపి యనుకొంటివా? ఈ మరణము నాకు లక్ష్యమే లేదు. కాని సంగ్రామరంగమున వీరాగ్రేసరులతో హోరాహోరిగాఁ బోరాడి వీరస్వర్గము నొందకుండ గడు నీచుడవును, వట్టి పిరికిపందవను నగు నీ యెదుట ప్రాణములు విడువ వలసి వచ్చినందులకు - విచారించు చున్నాను. ఓరీ! చండాలుఁడా! నీపై నిష్టములేని కన్యక నాశించి వృథామోహమునఁ జిక్కి—యెంతలెంత కూ్రరకృత్యము లాచరింపఁ బొల్పడితివి? మితిమీరినచోఁ గడకు ప్రా

ణ త్యాగమైనఁ జేసికొనునుగాని వేయిజన్మములు తపస్సు చేసి నను వీరభద్ర నిన్నుఁ గన్నెత్తియైనఁ జూచునా? నేను బ్రతికి యున్నను చనిపోయినను నా మాటయే నీకు బ్రమాణ మగు గాక. ఇక నీ యిష్టము వచ్చినట్లు చేసికొనుము.

కొండా—ఓరీ! పొగరుబోతా! నిస్సహాయుడ వయినను, నీకెంత తెగసాగు డున్నదిరా! ఇక నిన్ను క్షమించరాదు—పాదములం బడి ప్రార్థించవలసిన ఈ తరుణమున నింతగా చెలరేగు నీవు —బ్రతుకఁగూడదురా! దుష్టా! ఇంక నీ కులదేవతను ప్రార్థించుకొనుము.

ఖడ్గ—ఓరీ! దుష్టా! అనాథశరణ్యుఁడగు నీశ్వరుడే నన్ను రక్షింప గలఁడురా!

(ధ్యానించును)

(27 వ అనుబంధము)

కొండా—ఇంకేమి చూచెదరు? వీని తాత యెవ్వ డడ్డము వచ్చునో —వీని నీ కొండపైనుండి క్రిందికిఁ బడద్రోయుఁడు - అట్లే శాశ్వత విశ్రాంతి నందును గాక. (అందరును ఖడ్గనారాయణుని క్రిందికిం ద్రోయ యత్నింతురు. కృష్ణరాజు, మల్లినాథుడు, భిల్లులు వచ్చి అందరకు తుపాకులు చూపుదురు—కొండారెడ్డి తుపాకి దెబ్బతిని పారిపోవును. మిగతవారు ఖడ్గనారాయణుని వదలి పోవుదురు.)

3 వ రంగము

(గాయములకు కట్టుగట్టుకొని కొండారెడ్డి ప్రవేశము)

కొండా—(28 వ అనుబంధము)

నుదుటి గాయమునకు వేయిరెట్లు—హృదయమందలి గాయము బాధించుచున్నది. ఇట్టి నాకా శాంతి. ఖడ్గనారాయణ ప్రజ్వ లిత మగు విరోధ దావానలము శల్యాశల్య సంధిబంధము లందును, నిబిడీకృతముగ నిండి సలుపు చుండగా నా కెక్కడి శాంతి? వీని వైర మనుక్షణమును నా కధిక మగుచున్న దే! ఈ గాయముఁ జూచి యనపోతనాయుఁ డేమిగా భావించునో? దీనినికప్పుకొను నుపాయాంతరమేది? ఊఁ! ఏల కప్పు కొన బ్రయత్నింపవలెను? యీ యపరాధమును ఖడ్గనారా యణ ప్రభృతులపైననే రుద్దెదగాక! మేనమామ యని నమ్మి యున్న నన్నింత పరాభవ దుఃఖము పాలు గావించిన వీరా రెడ్డి దుస్థితిం గాంచి కెవ్వున కేరి నవ్వినగదా నా దుఃఖ మించుకంతైన శాంతించుట. క్రిందటి రేయి జఱిఁగిన పుర దహనమునందలి కుట్ర కంతటికిని మూలకారణము వీరారెడ్డి యేయని రాజును నమ్మింపలేకపోవుదునా? ఇది ఎంతటి కార్యము! నేడు రాజు సభగావించునని వింటిని. ఆసభయందు నాచమత్కారమునంతనుఁ జూపెదఁగాక!—

(నిష్క్రమించును)

4 వ రంగము.

అనపోతనాయని దర్బారు.

(ప్ర॥ అన॥ కొండా॥ సభ్యులు ఆసనములపై)

అన—రెడ్డీ!- మీ మామగారేల రాలేదు? కొలువుకూటమునకు, దయచేయుటకు వారికి తీరుబడి లేకయున్నదా యేమి? నేడు సభ జఱుగవలసి యున్నదని వారికి మేము వర్తమాన మంపితిమే!— అది వారి కందలేదు కాబోలును! మజిల కబు రంపుము.

కొండా—చిత్తము. ఏలిక నాకే యాజ్ఞాపించితిరి. సభకు రావలసి యుండునని నేను వారికి స్పష్టముగా నెఱింగించితిని.

అన—సరే! అట్లయినయెడల నెందుచేత రాలేదు.

కొండా—అతని శరీర మస్వస్థముగా నున్నదఁట! గతరాత్రి నిద్ర లేదఁట!

అన—ఔను—నిన్నరాత్రి పట్టణములో నెవఱికి మాత్రము నిద్ర యున్నది.

కొం—చిత్తము నేనాసంగతి కూడ చెప్పితిని. కాని యాతఁడు పెదవి విరచి—ఈసభ కెక్కడికి! వచ్చెదనులే- రాజునకు ఏమియుఁ దోఁచనప్పుడు, కాలక్షేపమునకై యిట్టిసభలు తఱుచుగా జఱుగుచుండవలసినదేకదా! నీవు వెళ్ళు—నాసంగతి నీకెందుకు? అని యసూయతో నతఁడు నాకు బ్రత్యుత్తర మిచ్చెను. మహారాజా! ఇంతకన్నను అతనిని నిర్బంధించుటకు నాకధికారము లేదుగదా!

అన— [కోపముతో) ఏమేమీ! వీరారెడ్డి కప్పుడే యింతవరకు కన్నులు నెత్తికెక్కెనా! అత డేమి చూచుకొని మాయెడల నింత నిర్భయత్వము వహించెనో... అకారణముగ బట్టణ మంతయు నిట్లు దహింపబడియుండ నిలుచుటకు నీడలేక పౌరులెల్లరు చింతాక్రాంతులై యుండ రాజునగు నేను సయితము ఘోరమగు నీ వైపరీత్యమును జూచి నిద్రాహారములు లేక విచారించుచుండ, తాను హాయిగా నింటిలో బరుండి యున్నాఁడా? రాత్రి వానికొంప దహింపబడలేదు గాబోలును. సరే! — అటులైనచో — వానికేల మనము ప్రయాస గలిగింప వలయును? అట్టులే పరుండి యుండవచ్చును. మరల మా ఆజ్ఞ యగు వరకు రాజగృహద్వారమును దాటిరావీలు

లేదు. మాయాజ్ఞగా వాని కెరిగింపుము. ముందుముందు వాని సంగతి విచారింతము.

కొండా—మహాప్రభూ! అతడు కేవలమును స్వజాత్యభిమానధనుడు. ఖడ్గనారాయణుని విషయమున దన యభిప్రాయమున కేలినవారు విరోధముగ నొనర్చి నప్పటి నుండియు వానికీ ఉద్యోగమునం దసహ్యము కలిగియుండెను. అందుపై నే కార ణము చేతనో కాని మూడు నాలుగు దినములనుండి నాతడీ పట్టణమును విడిచి పోవలయునని మిక్కిలి పట్టుదలతో బని చేయుచున్నాడు.

అన—ఆలాగునా! వాని కంత యుద్దేశ్యమున్నదను సంగతి నేనెఱగను. నాకు తెలిసియున్న యెడల వాని మనోభీష్ట మీనాటికే నెర వేర్చియుందును. ఈ సంగతులన్నియు విచారించి చూడ నిన్న రాత్రి జరిగిన మహాపదవిమునకుసంబంధించిన వారిలో వీరారెడ్డికూడ నొకడై యుండవచ్చునని నా కనుమానముగా నున్నది.

కొండా— మహాప్రభూ! తమరు వినవలసిన సంగతు లింక ననేకము లున్నవి. ఖడ్గనారాయణునియందు వీరారెడ్డి కింత యభిమాన ముండుటకు గారణమును తమ రెరుంగరు. తన కుమార్తె యైన వీరభద్రను ధరణికోట యువరాజగు ననపోతారెడ్డి పెండ్లి యాడునట్లు చేసెదనని యా మూర్ఖుడు వాగ్దానము చేసినందు వలన రెడ్డిగారికి వానియందింత యభిమాన ముదయించినది. కాని రెండునాలుకలుగల ఖడ్గనారాయణుడు వానితో నట్లు చెప్పి వీరభద్ర నెటులైన దానే దక్కించుకొన వలయునని లోలోపల రహస్యముగా ప్రయత్నింప నారంభించెను. మొదట నుండియు తన కుమార్తెను నాకే ఇచ్చెదనని వీరారెడ్డి నాతో చెప్పుచుండుటచే నేను గంపెడాశ వహించి యుంటిని.

గాని యీ ఖడ్గనారాయణుడు వచ్చిననాటనుండియు నాఆశ లంతరించినవి.

అన— ఇంతేకద! కొండారెడ్డి! నీవీ విషయమున భీతిదక్కియుండుము. వీరభద్రిను నీకిప్పించి మేము దివాణముననే పెండ్లిచేయించెదము.

కొండా— దేవా! దేవరవారి యభిమానమునకు వేయినమస్కారములు. తన కుమార్తెను నాకీయకపోయినను నాకు గోపము లేదుగాని యాతడు రాజద్రోహియగుటచే నేను మామయని గౌరవింపక శత్రువుం జూచినట్లు జూచుచున్నాను. యీయాంతరంగిక సంబంధము లన్నియు నేను బాగుగ నెరిగియుండుట చేతనే ఆనాడు మల్లినాధునిగాని ఖడ్గనారాయణునిగాని విడిచి పెట్టవలదని నేను తమతో నంత మొరపెట్టుటకు గారణమైనది. కాని నాపాపముచే నప్పు డేలినవారు నాయందువిశ్వాసముంపరైతిరి.

అన— రెడ్డీ! ఈ విషయములో నేను దూరమాలోచింపక పోవుట పొరపాటే. ఈసంగతులన్నియు— నాకప్పుడు తెలిసియుండిన యెడల వారినట్లు విడిచి పెట్టియుండను. అయిన నాసంగతి ఇప్పు డెందులకు? మల్లినాధుని విడిచిపెట్టుట నిన్నటి యుపద్రవమునకు గారణమేమో యనియా నీ యభిప్రాయము?

కొండా—మహాప్రభూ! కంటితో స్పష్టముగాఁ జూచుచుండ నను మాన మనుమాట యెందుకు? ఏలినవారు క్షమించినయెడల నేను గొన్నిప్రశ్నలు వేసెదను. ఆనాటి కొలువుకూటములో దేవరవారు రాయబారులను రప్పించి వారితో బ్రసంగించుటకు ముందు సభ్యులతో నుత్సవ ప్రసంగము నెత్తి యా ప్రసంగమున జఱుగవలసిన యేర్పాటులను చెప్పివేసితిరా.

లేదా! ఆ రహస్యముల నన్నిటిని రాయబారు లాలకించిరి గాదా! కావున శత్రువులయెదుట మనరహస్యములను వెల్లడించుట మొదఁటితప్పు. అందొకని చెరలోనుంచి రెండవ వానిని విడిచిపెట్టుట రెండవతప్పు—మహాప్రభూ! క్షమింపుఁడు. ఈ యుపద్రవమున కెల్ల కారకుఁడు మల్లినాథుఁడే. దైవవశమున బ్రతికితినిగాని— నిన్నరాత్రి— యీ మల్లినాథపిశాచము నకుఁ జిక్కి— నేను ప్రాణములఁ గోలుపోవలసినదే!

అన—ఏమేమీ! మల్లినాథుఁడా! మల్లినాథుఁడేనా? నీవు చూచితివా! చెప్పు— చెప్పు— ఏమి జరిగినదో చెప్పు.

కొండా—రాజేంద్రా! ఏమని మనవిచేయఁగలను! నిన్నరాత్రి భోజనమైన పిదప నుత్సవములోనికి బయలుదేర వలెనని, దుస్తులు ధరించుకొని వీథిలోనికి వచ్చుసరికి, మల్లినాథుఁడును వీరారెడ్డియును, ముసుగులువేసుకొని, యరుగుపైఁ గూర్చుండి యేమేమో గుసగుసలాడుకొనుచుండిరి. అందు, "పరశురామప్రీతి—" అను మాట నాచెవినిఁ బడినది. తరువాత, మల్లినాథుఁడు బయలుదేరి, మఱియొక వీథిలోనికిఁబోయి, యొక నూఱుమందిగల గుంపుతోఁ గలసికొనెను. నేనును, వెంటనంటి పోయినంతనే, యాగుంపు నాపైఁబడి, నా కపాళము బ్రద్దలగునట్లు పగులఁగొట్టిరి. ఇందు, మీ కేమైన ననుమానమున్నచో, నా శిరముపై నున్న గాయమును చూడవచ్చును.

(తలకట్టుఁదీసి చూపును.)

అన—(కోపముతో కత్తిలాగి) ఓయీ కొండారెడ్డి! నీవు, మా కాప్త బాంధవుడవు! ఆ మదాంధుఁడు ఆక్రూరచిత్తుఁడు ఆ రాజద్రోహి— యగు వీరారెడ్డి, యిఁక ప్రాణములతో నుండఁడు. వాఁడేకాదు. వాని కుటుంబ మంతయు, శేషు నా కన్నుల యెదుట నింతంత ముక్కలుగా ఖండింపఁ బడవలెను. ఇదిగో

ఈ ఖడ్గము చూడుము. ఇయ్యది—పితృవాక్య పరిపాలనా పరిపూర్తియందు నాకుఁ దోడ్పడి. సింగభూపతికిఁ గర్భశత్రువు లగు చాళుక్య రాజవీరుల కంఠముల నరఁటిచెట్ల కరణి ఖండించి—తద్రక్తధారలచేత—పితృతర్పణములు చేయించి చాళుక్యకులము పాలిటి పరశురాముఁడనని నాకు పౌరుష బిరుద మిప్పించి, నన్నుద్ధరించి—ప్రసిద్ధికెక్కిన మహాయుధరాజము!— దీనిని, నీకు బహుమానముగా నిచ్చుచున్నాను. నీవు మామ— అత్తయను నభిమానము. నుంచుకొనక రేపు రేపకడనే జాము ప్రొద్దెక్కులోపల పౌరుల యెదుట వీరారెడ్డి కుటుంబమును ఖండించి పారవేయుము. వాని కిదే శిక్ష.

(29 వ అనుబంధము)

(తెర వ్రాలును)





# ధరణికోట



—♦ రెడ్డివీరుల సంగ్రామకథ ♦—

## చతుర్థాంకము

### 1 వ రంగము

( కొండవీటిలో అనవేమారెడ్డి సభ )

(ప్రవేశము అనవేమారెడ్డి, ఖడ్గనారాయణుడు ఎఱ్ఱాప్రగడ కొందరు సభ్యులును )

ఖడ్గ—(అనవేమారెడ్డి పాదములకడ మోకరించి చేతులు జోడించి)

( 30 వ అనుబంధము )

అ-వే—నీవు నాయెదుట నింక నధిక ప్రస్తాపనము చేయకుము. నీవు నా కుమారుడవుకావు. నేను నీకు తండ్రినిగాను. ఓరి కుల నాపకా! ఎంత తెలివితక్కువపని చేసితివిరా! రెడ్డికులమున కంతకును తీరని కళంకము తెచ్చితివిగదరా!... మల్లినాథా! నీవు చెప్పినదంతయు మిగుల నద్భుతముగా నున్నది. ఎట్లో మీ రిరువురును బ్రతికివచ్చినందులకు మేము సంతసించు చున్నాము. కాని నన్నడుగకుండ — నా సెలవు గైకొనకుండ మారుపేరును, మారువేషమును ధరించి - ఈ యువరాజు రాయబారిగా నెట్లు బయలుదేరెనో - తెలియకున్నది.

చ. పడుచుదనంపు గర్వమున భావిగతిం బరికింపఁబోక నో
ఖడ్గ! విరోధిచేత జెరఁబెట్టఁగబడ్డ దురాత్ము నోటితో

గొడుకని పిల్చుకంటె నిఁక గూర్చెడు దుర్యశమేది? రెడ్డివం
గడమున నిన్నుఁబోలు నఘకర్ముఁడు పుట్టెనె? కీర్తి నెట్టెనే?

అదృష్టవశమున కృష్ణరాజు భిల్లసేనలతోవచ్చి రక్షింపకుండిన నీగతియేమి? ముందు రాజ్యమునకు రావలసినవాఁడవే? ఇదియా నీ విజ్ఞానము.

ఖడ్గ—(వినయముతో) తండ్రీ! నేనాచరించినది కడుంగడు నవిచార్య మగు కార్యమని నెఱుంగుదును. ఐనను—రాజభక్తి హైన్య మున నేనట్లాచరింపలేదు. అది తమకు దుర్యశోపాదకమగు కార్యముగాఁ బరిణమించినచో నేనే దానిఁ దీర్చుకోఁగల వాఁడను. నాయీపృథమాపరాధమును క్షమింపుఁడు,

మ. అపరాధంబు; క్షమింపుమో సుగుణధుర్యా! భావి చింతావిదూ
ర పరాధీన మనస్కుఁడనై సలిపి కారాగారముం జేరితిన్
నృపలోకంబు విభీతిచే నదఱ నేనే-ఖడ్గముంబూని శ
త్రుపతిం బట్టి త్వదీయ పాదతలి నుంతుఁ; నన్ను దీవింపుఁడీ.

అన-వే—ఓరీ! ఖడ్గనారాయణా! చాలునింక నీ డంబములు కట్టి పెట్టుము. నీ వింక మాకొఱకును మా రాజ్యము కొఱకును—మా కీర్తి కొఱకును విశేషశ్రమనందనక్కఱలేదు. సైన్యా ధ్యక్షుడవై ధరణికోట కధికారిగా నున్నంతమాత్రముచేతనే క్రిందుమీఁదు లరయక పెద్దల యాలోచనముంగొనక యింత స్వేచ్ఛగా బ్రవర్తిల్లుచుండిన నీవు—మున్ముందు రాజువైన ప్పుడు భూమ్యాకాశంబులు నీకన్నులకుఁ గనపడునా? ఇట్టి గర్వాంధుఁ డెన్నడును సింహాసనార్హుఁడుగాఁడు. ఓరీ! మూ ర్ఖుడా! నీకుఁదండ్రినైన నేను బ్రతికియున్నాఁడ ననుసంగతి మఱచిపోయితివా యేమి? కనుసన్నల మెలఁగు సేవకులు— సేనాధిపతులు— నుద్యోగులు— వేలకొలఁదియుండఁగా —

స్వాయముగా రాయబారము సేయబయలు దేరుటకు నీకు సిగ్గేల లేకపోయెను? అందులో రాచకొండ కాప్రియాణము! వారు మనకు గర్భశత్రువు లను మాటయైన నేల తలంపలేదు? ఛీ! శత్రుకారాగృహమున బంధితుఁడవైన నీబ్రతు కెందులకు? ఇంతటి పౌరుషవంతుడవగు నిన్ను ప్రజలు రాజుగా నంగీకరింతురను నమ్మకము నాకు లేదు. వీరారెడ్డి కుమార్తెయందున్న మోహమే నిన్నచ్చటి కట్టీడ్చుకొనిపోయియుండును. ఛీ! అల్పజ్ఞానీ! రెడ్డిరాజవంశములకంతకును గళంకమాపాదించిన నిన్ను నేనిప్పుడు రాజశాసనముప్రకారము శిక్షింపక వదలినచో— ప్రజలు నన్ను పక్షపాత చిత్తుఁడని దూషింతురు. కావున నా సెలవు లేకుండ నీవుచేసిన యకార్యమున కిప్పుడే తగిన ఫల మనుభవింపుము. నేటినుండియు నీ తమ్ముఁడగు చినవేముఁడు సైన్యాధ్యక్షుఁడును—యువరాజునై ధరణికోటం బరిపాలించుచుండును. రాజ్యమునం బట్టి యధికారమునులేక రాజోచిత వస్త్రాలంకారములను విడిచి నీ వొక సామాన్యునివలెనే యారు మాసములవరకు సంచరించుము. ఈలోపల నీప్రవర్తనము నిష్కళంకమై జరుగనున్న సంగ్రామమున నీవేమైన పనిచేసినట్లు మా కగపడినయెడల మరల నీవు యథాస్థానమునకు రాఁగలవు.

ఎఱ్ఱా—మహాప్రభూ! మా మనవి చిత్తగించి కుమారునియందు దయఁదలంపుము. ఏది యెట్లున్న నిది ప్రమాదము అందు ప్రథమాపరాధముగదా! క్షమించుటయు ప్రభువులకు విభూషణమే.

అన-వే—అమాత్యమణీ! ఇతఁడు చేసిన నేరము క్షమార్హమైనది కాదు. మీరు వానివిషయముల నెంత యధికముగఁ జెప్పుచుండిన నంతపట్టుదల మితిమీరునేకాని వేఱుగాదు. నేటినుండి

యును వీని ఖడ్గనారాయణ బిరుదము సయితము తీసివేయఁ బడినదని యెల్లఱు నెఱుంగుదురుగాక! శత్రువులు మన రాయ బారులను హింసించిరి. ఇది మనకుఁ బరాభవము కావున నా మాటలను సావధానముగ వినుడు.

చ. కుమతులు రాచ లాధరణికోట నెదుర్కొనఁ జూచుచుండి, రీ
సమయమునందు తామసము సల్పిన మోసము సిద్ధమాను; మీ
రమల మనీషులార! సమరావని జేరఁగ సర్వసిద్ధులై
శ్రీమగొని మీదు పూర్వుల యశంబును రెడ్లజయంబు నిల్పుఁడీ.

అందఱు—(కత్తులు ధ్వనింపఁ జేయుచు) రెడ్డిరాజ సార్వభౌమునకు జయ్!

అన_వే—మఱియొకమాట సేనానాయకు లందఱును తమ తమ బలంబులను సిద్ధము చేసుకొని ధరణికోట కరుగవలయును. అన్నారెడ్డియు మల్లారెడ్డియు కొత్తయువరాజును వెంట నిడుకొని నేడే ధరణికోటకు బయలుదేఱి యచ్చట చేయ వలసిన సన్నాహములన్నియుఁజేసి - సిద్ధముగ నుండవలెను. మల్లినాథా! అవసరమైనపుడు భిల్లసేనలతో మనకుఁ దోడగు మని కృష్ణరాజుతోఁ జెప్పుము.

(అందఱు కత్తులులాగి) రెడ్డిరాజ సార్వభౌమునకు జయ్!

అన_వే—వీరాగ్రేసరులారా! యుక్తాయుక్త విచక్షణజ్ఞాన శూన్యుఁడై మన రాయబారినిఁ బట్టి కారాగారగృహమునఁ బెట్టినందులకు ప్రతిఫలముగా ననపోతనాయనిఁ బట్టి చెఱలోఁ బెట్టగల సామర్థ్యముగల వీరుఁ డెవడైన నీసభామధ్యమునఁ గల్గినచో నీ బంగారు కంకణమును నవరత్న స్థాపితమగు నీ కనక ఖడ్గమును వచ్చును. ఈకార్యమునకొక్క ఖడ్గనారా యణునకు మాత్రమధికారములేదు. (కంకణము నుంచును.)

మల్లి—మహారాజా! ఇదియేమి న్యాయము! ఖడ్గనారాయణునకే యధికారము లేనిచో నింకెవరు మదోన్మత్తుడగు ననపోత నాయని బంధింప సమర్థులు గలరు? మా యాశలన్నియు నాతనిపై ననేకదా యున్నది. యువరాజ్యపట్టము లేకున్నను రెడ్డిసామ్రాజ్యపు గౌరవాగౌరవము లాతని చేతనే కదా నిల్చి యున్నది.

ఎఱ్ఱా—రాజేంద్రా! ఇట్టియాటంకమును వచించి మీరీకంకణమును నిచ్చట నుంచినను నుంపకున్నను ఒక్కటే;—ఖడ్గనారాయణు నకు నయిత మిందధికారమీయనిచో నీకంకణము నీసభలో నెవ్వరును ముట్టరు.

అన-వే—సరే - మీరందఱు నింతగా చెప్పుచున్నారు గావున, వారికిఁ గూడ నధికారమిచ్చితిని.

ఖడ్గ—(ముందునకువచ్చి) ఓసభ్యులారా! తండ్రీ! వేమభూపాలకా!— కాదుకాదు ఇట్టి నేను నీకుమారుడనుగానుండదగనని సెల విచ్చితిరి గావున— మహారాజా వేమభూపాలకా! రాజాజ్ఞ గైకొనకుండ స్వతంత్రించి రాయబారిన్నై— స్వయముగా రాచ కొండకు బయలుదేరి మహాపరాధమొనర్చిన మూర్ఖుడనయ్యు పంచభూతములు సాక్షులుగా— నాయంతరాత్మయందు ప్రభు విషయమై యణుమాత్రమైనఁ దిరస్కార భావములేదు. రాచకొండయందలి రాజకీయ రహస్యములను రహస్యముగా గనిపెట్టవలయుననియు— ముఖ్యమగు రాజకీయాంశములను— నీ రాజుతో ముఖాముఖిగా మాట్లాడి పర్యవసానము కనుగొన వలయుననియు నూహించి— యిది మహాపరాధమని యెఱుంగక నేను బయలుదేఱినమాట వాస్తవము - తెలిసియో - తెలియకయో తప్పుచేసినవాఁడ నగుటచే రాజశాసనము ప్రకారము రాజదండనకు పాత్రుడనౌదు. ఏరారెడ్డికుమార్తై

యందలి మోహముచే నేనురాచకొండకు బయలుదేరితి ననుమాట, యీశ్వరసాక్షిగా నసత్యము - ఏది యెట్టులయిన, రాజాజ్ఞ ననుసరించి-నే నాఱుమాసము లజ్ఞాతవాస మొనర్ప వలసి యున్నది. యువరాజపదవి విడిచి - సైన్యాధిపత్యమును విడిచి - రాజచిహ్నములగు - హేమకిరీట భూషణాంగ దాదులను విడిచి - యొక సామాన్య పురుషుఁడ నగుటచే - నింక నాయిష్టము వచ్చునట్లు స్వేచ్ఛగా సంచరించుచు, నా పూర్వస్థానమును, మఱల సంపాదించు కొనుటకుఁ దగిన ప్రయత్నము చేసికొనుచుండెదను-అన్యాయముగ నన్నుఁ గారాగృహమున బంధించిన యయ్యనపోతనాయని, నే యుపాయము చేతనయినబట్టి యీ యాఱు మాసములు దాటకుండ, భూనాయకున కప్పగించి సంగ్రామరంగమునుండి విజయ లక్ష్మినిఁ దోట్కొనివచ్చి ధరణికోటయందు తాండవ మాడించెదను - ఇందుల కశక్తుఁడనైననాడు - అప్రతిమ ప్రతిభా ధురంధరుండగు నీ భూపాలుఁడును - మహామహు లగు నీ సభ్యులును - నా ముద్దుతమ్ముఁడగు ననవేమారెడ్డికి యువరాజ్య పట్టాభిషేకముచేసి - నాకు పరలోక క్రియలను గ్రహింతురు గాక! తండ్రీ! - నాచితికాలుచున్న సమయమున, నాయాత్మ నీవంకకు దిఱిగి క్షమావందన మొనరించును - అప్పుడయిన - నన్ను క్షమింతువుగాక! తిరిగి నాకు తమ దర్శనమున కదృష్టమున్నచో ధన్యుఁడనే - కాదేని యిదే తుది నమస్కారము - ఇప్పుడే - నేనీ హేమ కంకణమును - రత్నఖడ్గమును దాల్చుచున్నాను.

అందరు—ఖడ్గనారాయణునకు జయ్ - (పుష్పహారములు వేతురు.)

(తెర వ్రాలును)

—:o:—

## 2 వ రంగము.

(రాచకొండలోని యొకవీధి)

(నీల విక్రమ రాజను పేరుగల పురుషాకృతితో)

విక్రి—(స్వగ॥) ఎన్నడును, అభ్యాసము లేకపోయినను, కార్య భారముచేత, నేనీమగవేషము వేసికొనక, తప్పినదికాదు! నేను, విక్రమరాజను పేరుపెట్టుకొనుట నాలో నాకేనవ్వు తెప్పించుచున్నది. విక్రమరాజంట!—విక్రమరాజు!! ఎక్కడ నున్నదా విక్రమము! లోగుట్టు పరమేశ్వరునకెఱుక! నేను మందముగనే, యమటినది, గాని – మగతనము నెక్కడినుండి తేగలను ఈ వేషముతో నీవ్యూహము కడతేరగనా ధన్యురాలనే. నా మిత్రురాలగు సన్నపూర్ణ హితోపదేశముచేత వీరభద్రా ఖడ్గనారాయణుల కేస్నేహ మనుపకారము చేయఁ గల్గిననే కదా ధన్యురాలను............... అదిగో! ఎవ్వరో యీ వంకకు వచ్చుచున్నారు. నేను కొంచెము ధైర్యముగ నిలువ బడవలెను.

[వెంకన్న ప్రవేశము]

వెంక—ఓహో! ఎవరటిది? – మొగముపీడి – మగడు స్త్రులు – ఏదో మాయవేషముగా నున్నదే! (తేరి పారజూచుచున్నాడు.)

విక్రి—తాతా! ఏమట్లు బహునిదానముగా చూచున్నావు?

వెంక—హో త్తేరీ కొంటెసన్నాసీ! నీకుగూడా పుట్టునే సెగులూ—ఏమి? నీకళ్ళకుగూడా నేను తాతలా గున్నానా? ఈపడుచుగిత్తల కేం తెగులురా బాబూ కొంచెం గడ్డం నెఱిస్తే సరియుట – తాత! నేను వీళ్ళబాబుల్ని కన్నానా?

విక్రి—కోప్పడబోకు తాతా!

వెంక—అదిగో మళ్ళీ అదేమాట. నాకు కోపమొస్తూందంటూ వుంటే?

విక్రి—కాదు; కాదు; వెంకన్నా - నన్ను బహు నిదానముగా జూచుచున్నావు. నన్నెవ్వఱని యభిప్రాయ పడుచుంటివి?

వెంక—ఎవడవో కాని నీల అన్న వే... ఏమిటీ! నువ్వు నీలఅన్నవా! ఔనుఔను! అందుకే అచ్చంగా నీలలా గున్నావు ఐతే నువ్వెప్పుడు వచ్చావు? నీలను కలుసుకున్నావా? మాట్లాడావా! నేనువెళ్ళి పిలుచుకొని రానా!

విక్రి—తాతా! ... ... ... ఇంకెక్కడి ... ... ...

వెంక—అదిగో! మళ్ళీ తెగులు పుడుతూంది - పుడుతూంది.

విక్రి—ఆ—ఆ—మఱచిపోయినాను తాతా! - కాదు కాదు. వెంకన్నా - నీల చనిపోయినది సుమా!

వెంక—అయ్యో! - నీలా - నీలా - నీలా - నీకెంతలో నూఱేండ్లు నిండిపోయిన వే!
నీలా (పెద్దగా నేడ్చును.)

[తరువాత అన్నపూర్ణ ప్రవేశము]

అన్న—ఏమిటి? వెంకన్న తాతా! ఏడ్చుచున్నావు?

వెంక—(ఏడ్చుచునే) అదిగో! అన్నపూర్ణ గూడా తాతంటూంది - అందఱికీ పెద్దరోగమే... ... ... ...నీలా—నీలా నానోట్లో మన్నుబోసిపోయినావా?

అన్న—నీలకేమి! ఎందుకేడుస్తున్నావు?

వెంక—(కోపముతో ఏడ్చుచునే) పోవే! అన్నపూర్ణా! అట్టేనన్ను వాగించకు—

అన్న—నీల కేమి!

వెంక—ఆ! ఏమా! చచ్చింది.

అన్న—అయ్యయ్యో! పాపం—ఐతే, నీలకోసం అంత పెద్దగా ఏడ్చుచున్నావేమి? నీకు చుట్టమా? పక్కమా?

వెంక—ఏడిచేది నీల కొఱకుగాదు.

అన్న—మరెందుకూ?

వెంక—ఈకుట్టివాఁడు ఆడదైతే నీల చచ్చిన విచారం లేకుండా పెళ్లాడుదునుగదా - అని యేడుస్తూన్నా - ఆఁ—ఆఁ— (ఏడ్చును.)

అన్న—ఆకుట్టివాఁ డెవఁడు?

వెంక—నీల అన్నగారు! (ఏడ్చును)

అన్న—(అటుతిరిగి) ఓహో! విక్రమరాజుగారా! ఎన్నాళ్ళకు ఎన్నాళ్ళకు (కౌఁగిలించుకొనును.)

వెంక—(ఏడుపుమాని తెల్లపోవుచున్నాఁడు.)

విక్ర—తాతా! ఏమి చూచుచున్నావు?

వెంక—(మొగము వికృతముగాఁ జేసి) ఉ... ... ... ...

అన్న—తాతా! ఏమీ మాట్లాఁడవు?

వెంక—(వెనుకటివలెనే) ఆ... ... ... ... ...

అన్న—తాతా! తాతా !!

వెంక—తాత! తాత!! వద్దన్నకొద్దీ - తాతే!

విక్ర—కాదులే! వెంకన్నా! ఏమిటి తెల్లపోతున్నావు!

వెంక—తెల్లపోతున్నానా? తెల్లపోవడ మేమిటే ... అన్నపూర్ణా!
నాగుండెలు దిగజాటిపోయి నాప్రాణం బేజారై పోయింది.

విక్రి—ఎందుకనీ?

వెంక—మీాఇద్దఱికీ - యేదోవుందని—

అన్న—ఓరీ నీ పొట్టపాడవా! ఎంతమాటన్నావురా!

వెంక—(అన్నపూర్ణా విక్రిములచుట్టుతిరిగి ఆడుచుపాడును.)

31 వ పాట బ్యాగ్ - త్రిశ్రగతి

అన్నపూర్ణ విక్రిముల అతుకే అతుకూ।
చెప్పకుండా పారిపోతే బతుకే బతుకూ ॥అ।
చిన్నారి వలపులూ! చిరునవ్వు కులుకులూ ।
చెలరేగి నడువీధిలో ! వహ్వా! చెలరేగి నడువీధిలో ।
హాసము । పరిహాసము । సంత్రాసమూ । అభాసమూ ॥అ॥

విక్రి—ఆ! - ఆ! - ఏమా యల్లఱి?

అన్న—ఈసంగతి యెక్కడను వెల్లడింపవుగదా!

వెంక—ఏమో - నాది తెట్టనోరు - పొరపాటున నోరుజాఱితే—

అన్న—నోరు జాఱితే - చేయి జాఱుతుందేమో—

వెంక—ఏమో నేను స్థిరంగా చెప్పలేనబ్బా!

విక్రి—అట్లయిన నీకిక దెబ్బలు తప్పవు - పద —

(ఇద్దరు వెంకన్నను కొట్టుచుందురు. తెరవ్రాలును.)

---

## 3 వ రంగము.

## రాచకొండలోని కారాగృహము

(ప్రవేశము - వీరభద్రియు, అన్నపూర్ణయు)

అన్న—వీరభద్రా! ధైర్యము దెచ్చుకొనుము. ఈ కష్టములు గట్టెక్కగలవు. కొండారెడ్డి యన్నివిధముల చేతను-సంపూర్ణముగ పరాభవింపబడి పశ్చాత్తప్తుడై యుక్తప్రవర్తనుడు కాగలడు, వానిభయమింక నీకుండదు. అంతవఱకు, నీవు కన్నులుమూసి కాలముగడువుచుండుము. రాజు తొలుత నీ తలిదండ్రులను వధింపఁ గొండారెడ్డి కాజ్ఞనొసంగి మఱల నెందువలననో దేశత్యాగులనుగా మాత్రమే - నీదేభారము.

అన్న—ఉష్! ఊరకుండుము. కొండారెడ్డి వచ్చుచున్నాడు.

(కొండారెడ్డి ప్రవేశము.)

అన్న—(ఎదురేగి) వేళయైనదా! ఇక పురాణము విప్పవచ్చును.

కొండా—అన్నపూర్ణా! నాయెడల నీకింత నిర్భయమేల? ప్రతిదినమును నే నత్యంతక్రోధముతో నేడెట్టులైన వీరభద్రిను సాధించితీరెద నను పట్టుదల సహించి యిచ్చుటకు వచ్చుచుండ నీవు నన్ను నవ్వించి నా కోపమును చల్లార్చి పంపివేయుచుందువు. ఇకనైన మీ వీరభద్రి మనస్సు మరలినదా? నిష్కారణముగా నీ కారాగృహమున నెంతకాల ముండగలదు. తన మూర్ఖపు పట్టుదల వీడునంతవరకు నీ యిడుములు తప్పవని నీవు దృఢముగా జెప్పుము.........నీ వెందుకు? నేనే చెప్పెదను. నేనే యామె మనస్సును మరలించెదను. (దగ్గరకు జని) వీరభద్రా! మాటాడవేమి? ఎంతకాల మీ కారాగృహమున నుండగలవు?

అన్న—ఆమె కిక్కడనే హాయిగా నున్నదట! అందుచే ప్రాణము న్నంతవరకు నిందులోనే యుండునట!

కొండా—నిన్ను నే నడుగలేదు. నీవు మాటాడకు. వీరభద్రా! చెప్పు—ఈ వట్టి పట్టుదలతో సుకుమారమగు నీ శరీరము నేల గాసిలి చేసుకొనెదవు?

వీర—ఓరీ! ఈ అధిక ప్రసంగ మంతయు నీ కెందుకు? నీవు బ్రతికి యున్నంతవరకు నా కేసౌఖ్యము నక్కరలేదు. నే నిందులోనే కాలము గడిపెదను.

కొండా—వీరభద్రా! నాచావుకోరుటకు నీ కేమి విషము పెట్టితినో చెప్పు?

అన్న—(చెవులు మూసికొని) రామరామ! వీరభద్రా! నాకు వైధవ్యము తెచ్చిపెట్టకుము. నిన్ను బ్రతిమాలుకొనెదను.

కొండా—అదేమి? మధ్యను నీకేమి వైధవ్య మున్నది?

అన్న—ప్రాణేశ్వరా! మీ రిట్టి యమంగళ వాక్యములచే నా మనస్సును నొప్పింపకుడు.

కొండా—ఛీ! సిగ్గుమాలిన శిఖండి! ఎన్ని చెప్పినను—నీ వెనుకటిపాట నీవు మానకున్నావు గదా!

అన్న—మీ వెనుకటి పాట మీరు మానకున్నారు. నా వెనుకటి పాట నేను మానకున్నాను. మన యిరువురి బుద్ధులు— నొక్క రీతిగానే ప్రకాశించుచున్నవి.

కొండా—అన్నపూర్ణా! నీ వెన్ని చెప్పినను వీరభద్రను నేను విడచిపెట్టను.

అన్న—ప్రాణేశ్వరా! మీ రెన్ని చెప్పినను నేను మిమ్ములను విడిచి పెట్టను.

కొండా—విడిచిపెట్టక నన్ను బలవంతముగా పెండ్లిచేసుకొనెదవా యేమి?

అన్న—బలవంతముగా గాదు. మి మ్మొప్పించియే పెండ్లియాడెదను.

కొండా—లేశమైన నిష్టములేని నన్నెట్టు లొప్పింపగలవు?

అన్న—ఆ శక్తి నాయందున్నది.

కొండా—అంతశక్తి గలదాన వైనచో నింతకాలము వీరభద్రు నేల యొప్పించలేదు.

అన్న—అది నా కిష్టములేక—

కొండా—ఎందుచేత?

అన్న—సవతి వచ్చునను దుఃఖముచేత—

వీర—అన్నపూర్ణా! అట్లు చీవాట్లు పెట్టి తగినట్లు బుద్ధి చెప్పుము.

కొండా—యీ చీవాట్లకు నేను భయపడు వాడను గాను.

వీర—సిగ్గు— లజ్జను విడిచి పెట్టినచో మూడులోకములులను జయింప వచ్చును.

కొండా—మూడు లోకములుగాదు ఒక్క— నిన్ను జయించుటకే ; నే నా రెంటిని వదలి పెట్టితిని.

వీర—తలపాతుకొన్నను నీ కీ జన్మమున నిది—సాధ్యముకాదు.

కొండా—సరే! ఎవరు గెలిచెదరో నీవే చూచెదవు. తొందర యెందులకు?

అన్న—(నడుమకువచ్చి) నేనే గెలిచెదను.

కొండా—నీమాట నెవ్వ రెత్తిరి? ఛీ! పో...

అన్న—(నవ్వును)

కొండా—ఏమా పరిహాసము?

అన్న—(మరల నవ్వును)

కొండా—(చిరాకు పడును) ఇది నా కోపమునంతను తగ్గించివేయు చున్నది. ఇది సమయము కాదు. ఒంటిగ వీరభద్రితో మా టాడెదను. పోబోవును)

అన్న—బావా! మాట—మాట—

కొండా—(ఆశతో) వచ్చి) ఏమి రహస్యమా?

అన్న—ఆ—రహస్యమే—

కొండ—ఏ మా రహస్యము?

అన్న—చెప్పనా?

కొండా—అబ్బ! ఆలస్యమేల?

అన్న—వడ్లగింజలో బియ్యపుగింజ.

కొండా - ఛీ! దుష్టురాలా! నీవుండగా - నేనిక్కడికి - రానేరాను,

అన్న - (నవ్వును.)

కొండా - (కోపముతో నిష్క్రమించును.)

(తె ర ప డు ను)

---

## 4 వ రంగము

(పురవీథిలో — వెంకన్న ప్రవేశము

(32 వ అనుబంధము)

వెంక—అన్నపూర్ణ విక్రమరాజును తగులుకొనిపోయింది. ఆహాహా! విక్రమరా జాడపిల్లయితేనా! వెంకన్న అదృష్టమే అదృష్టము. - కాని అన్నపూర్ణని మరిగిన విక్రమరాజు ఆడదెలాగ అవుతాడు? కాడు... కాలేదు - అన్నపూర్ణ నానోట్లో పెద్ద కరక్కాయకొట్టి విక్రమరాజు వెంటబడి లేచిపోయింది. నా వొళ్ళు మండుకొని పోతూంది. అన్నపూర్ణను చంపేతునా! చంపేస్తేమాత్రం — విక్రమరాజు ఆడదౌతాడా? కాడు — కాలేదు. నానోటిలో వెలక్కాయ( నీల చచ్చింది బతికొస్తుందా! రాదు - రాలేదు. నా నోటిలో కొబ్బరికాయ ... (అదరిపడి అటునిటుజూచి) అడుగో! కొండారెడ్డి! సెబాస్! మంచి ఉపాయం తోచింది. అన్నపూర్ణ విక్రమరాజును మరిగిందని - కొండారెడ్డి చెవిలో ఊదుతాను. చేయవలసిన పని అతడే చేస్తాడు.

(కొండారెడ్డి ప్రవేశము)

కొండా—(ఆలోచించుచు) ఈ యన్నపూర్ణ యభిప్రాయము తెలియ రాదయ్యెను. నాపై - మొదటినుండియు ననురాగము గలదియే; కాని నా చిత్తమన్యథా ప్రవర్తిల్లుచున్నప్పుడు నేను దాని యనురాగము నేమిచేయగలను? దాని ప్రాప్తమంతే-

నాప్రాప్తమింతే-వీరభద్రాకరగ్రహణము చేసినప్పుడుగదా-నాజన్మము ధన్యమగుట! పానకములోని పుడకవలె నాకీ యన్నపూర్ణ యొకతె నడుమ దాపురించినది గదా! ఇది యెదుట నుండగా వీరభద్ర నేమనుటకును యేమి మాటాడుటకును

నాకు ప్రాణసంకటముగా నున్నదే! నేనేమిచేయుదును? పోనిమ్ము — దీని మూలముననే వీరభద్రను చేజిక్కించుకొందమనుకొన్న తనకు సవతివచ్చునని దుఃఖమట — అదియును వలనుగాని పనియే యయ్యె... నిన్ను చేపట్టుదునని దీని కాశజూపి తన్మూలమున వీరభద్రను వశపఱచుకొని పిదప నన్నపూర్ణను నిరాకరింతునా? కాదుకాదు — వినలేదా — అన్నపూర్ణా నిశ్చయమును? తనకు సవతి వచ్చుటయే సమ్మతముగాదట — నన్నెట్లో మెప్పించి వివాహమాడు ధైర్యము తనకున్నదట — ఇట్టి యన్నపూర్ణ నా లంచగొండి మాటల నేల నమ్మును? కల్ల — నాకేమార్గమును తోచుట లేదు——

(పోవుచుండగా వెంకన్న యెదురుపడును.)

వెంక——(కొండారెడ్డి చుట్టును తిరిగి పాడును.)

("అన్నపూర్ణ విక్రముల అతుకే అతుకూ" అను వెనుకటి రీతిగా)

కొండా——వెంకన్నా! ఇదియేమి? ఆనందముతో నెగురుచున్నావు?

వెంక——(అన పూర్ణ విక్రముల అని పాడుచుండును)

కొండా——(మెడపట్టుకొని) వెంకన్నా! నీకు మతిపోయినదా యేమి? అన్నపూర్ణా యనుచున్నావు... విక్రమరా జనుచున్నావు... అదియేమి?

వెంక——ఓహోహో! కొండారెడ్డిగారా! ఆహాహా! ఏమిచూపు చూచానయ్యా! చూపన్నచూపా! బలేచూపు.

కొండా——ఓరీ! ముసలికోతి — అరవ నాటకములోని హాస్యగానివలె నూరక అభినయించెద వేమి? నీ యభినయము పాడుగాను! ఏదో తేల్చు.

వెంక——కాశీ అన్నపూర్ణ దేవిగారి ప్రేమసంతర్పణ.

కొండా—కాశీఅన్నపూర్ణ యెవరు? మన అన్నపూర్ణ యేనా!

వెంక—ఇం కెక్కడి యన్నపూర్ణ?

కొండా—ఏమీ?

వెంక—(మరల "అన్నపూర్ణ విక్రిముల" అనుపాటపాను చు ఎగురును)

కొండా—(వెంకన్నగొంతు పట్టుకొని) తులువా నాతో పరిహాస మేమి? నిజము చెప్పెదవా లేదా!

వెంక—అయ్యయ్యో! చెప్పుచుండగా నన్ను చంపవచ్చెదవేమి?

కొండా—నీవు చెప్పినది నిజమేనా!

వెంక—అబద్ధము లాడుటకు నేనింకను బ్రతికి ప్రఖ్యాతి నందుదునా ముసలిముండ వాడను.

కొండా—అట్లయిన అన్నపూర్ణా విక్రమరాజులకు సంబంధమను మాట నిజమా?

వెంక—నాకన్నులతో జూచిన విషయ మబద్ధ మెట్లగును?

కొండా—అదే చెప్పవలెను. నీవేమి చూచితివి?

వెంక—నడువీథిలో - నాయెదుట - నిర్భయముగా - అన్నపూర్ణ విక్రమరాజును "ప్రాణేశ్వరా" యనిపిలచి కౌగిలించుకొన్నది. అడ్డముపోగా నన్నిద్దఱును కలసి, చిదుకగొట్టినారు.

కొండా—నేను నమ్మను, అన్నపూర్ణ యేమి? నాపై మోహమున జచ్చిపోవు నన్నపూర్ణ యేమి! ఆడుమొగపు విక్రమునేమి? వరించుట యేమి?

వెంక—నీవు నమ్మకున్న - నేను వారియింటికి తీసుకొనిపోయి చూపుదును.

కొండా—ఏమి? అన్నపూర్ణ విక్రముని వలచినదా? ఔరా! నాపై

నెంత ప్రేమ యున్నట్లు నటించుచు వచ్చె? నేను దీనిమాటలను పూర్ణముగా నమ్మితిని. పోనిమ్ము - దీనికి విక్రముడు ప్రియదర్శనుడయ్యె ననుకొందమన్న - వాని మొగమున నబలాత్వముదప్పు - పౌరుషమే కానరాదే.........ఔను నాకీ విషయమున సందేహమేల? ప్రేమ గ్రుడ్డిదిగదా!

"సీ. అమితమా ధనమున కాశించు నొక్కతె
మొగము నందముఁ గాంచి ముఱియు నొకతె
కేరడంబులు గాంచి కిచకిచ మనునొత్తు
సిగమల్లెపూలకై ?చెలఁగు నొకతె
ఆడంగితనమును వర్ణించు నొక్కతె
సంగీత మాలించి పొంగు నొకతె
చొల్లుడాబులు విని యుల్లసిల్లునొకత్తె
నడకఠీవినిఁ జూచి మిడుకు నొకతె

గీ. ముంగురులు గిరజాలకై ముఱియు నొకతె
నాటకపు వేషమునకుఁ గన్గీటు నొకతె
వెఱ్ఱివాని నవ్వులకును పెలఁది ప్రేమ
కెంత తలచింపుకొనినను హేతువున్నె!

(వెంకన్నతో నిష్క్రమించును)

—:o:—

5 వ రంగము

(అన్నపూర్ణ యిల్లు)

విక్రమరాజు - (తలుపు తట్టుచు) ప్రాణేశ్వరీ! ప్రాణేశ్వరీ!

అన్న - (తెరలో) ఆ! ఇదిగో - వచ్చె - వచ్చె.

(కొండారెడ్డి వెంకన్న ప్రవేశించి చాటున నిలతురు.)

కొండా - చూచితివా! వెంకన్నా! ఆ దుష్టు డిక్కడికే వచ్చినాడు.

వెంక—ఆ దుష్టుడు వచ్చుటేకాదు. ఆదుష్టయు రానున్నది.

(తలుపు తెఱువబడును.)

కొండా—(కోపము నభినయించును.)

వెంక—(ఊరకుండు మని నివారించును.)

విక్ర—ఏమడుగుచున్నావు? ఎప్పుడు వచ్చితిననియా? నేటి మధ్యాహ్నముననే వచ్చితిని. రాజుగారిని సందర్శించి చెప్పవలసిన మాటలుచెప్పి యాలస్యమైనచో నీ కేమి కోపమువచ్చునో యని వచ్చినాను.

అన్న—ఎంతభయము! పాపము! నాభయముచేతనే యిట్లు శుష్కించిపోవుచున్నావు కాబోలును.

విక్ర—ఔను - నిజముగా నట్లే - నీవునన్ను బెండ్లాడెదవో లేదో యను విచారముచేతనే నిరంతరము నిట్లు శుష్కించి పోవుచున్నాను.

అన్న—అలాగుననా? అబ్బ! ఇంతలోనే యెంత గడుసుదనము నేర్చుకొంటివి. (ముద్దిడుకొనును.)

కొండా—(తలకొట్టుకొని) ఆహాహా! ఎంత దుర్భ్రమ!! ఆడు ముండలను నమ్మి చెడిన యధమాధములలో నేనొకండ నైతినా? నా తెలివి యిపుడేమి పనికివచ్చినది? ఎన్నెన్ని కొంపలనైన నొక్క కొఱవితో గాల్చగల జగజ్జంతలు గద! వీరు!

గీ. ఒక్కనికిఁ గన్నులను సంజ్ఞ; ఒకని కతిర
హాస్యమగు వార్త; ఒకని కత్యంత ప్రీతి

యొక్కనికి బాసఁజేసి వేఱొకనిఁ గూడి
కల్లలకు నిల్లగుదు రుర్వి కమలముఖులు.

వెంకన్నా! నే నీ దృశ్యమును జూడలేకున్నాను. ఈవిక్రమ రాజును జూచిన నాశరీరము తపించుకొని పోవుచున్నది. నాకు ప్రతిస్పర్థియై వీడెక్కడ దాపురించెను? వీని నిప్పుడే చంపకున్న నాకు శాంతములేదు.

వెంక—అయ్యయ్యో! మీరాలోచన లేక తొందఱ పడుచున్నారు. మీరు విక్రముని చంపినంతమాత్రమున నన్నపూర్ణ సమ్మతించునా? అంకుమగనిని మఱగిన దానిని కుళ్ళిన శరీరభాగమునువలె - కోసివేయ వలయుగాని......

కొండా—ఉండుండు - మఱల నేదో శృంగార ప్రబంధమును విప్పినారు.

అన్న—విక్రమా! నీవు మాధవపురమున కేగి వచ్చులోపల నిన్ను జూచి యెందఱు కన్యలు మోహించిరో చెప్పు.

విక్ర—నేను చెప్పను; నీవు నన్ను పెండ్లియాడెదవా లేదా? లేని యెడల నిదిగో కత్తి; చూడు—

అన్న—(నవ్వుచు) ఓహో - నీధైర్యమునకు తోడుగా - నీవద్ద కత్తిగూడ నున్నదా? నీ కిది యెవ్వరిచ్చినారు?

విక్ర - మహారాజగు ననపోతనాయఁడు.

అన్న—సరేకాని మన మిదివఱలో ననుకొన్న కార్యమునుగూర్చి యెప్పుడు?

విక్ర—చెప్పెదను; భోజనములైన పిదప మనమిరువురమును పండుకొని సావకాశమున మాటలాడుకొనవచ్చును. లోపలకురమ్ము.

[ముందు తెర వ్రాలును.]

కొండ—[విచారముతో కూర్చుండును.]

వెంక—కొండారెడ్డిగారూ! ఇక్కడ వీధిలో కూలబడితి రేమిః? ఇంటికిఁ బోవుదమురండు.

కొండా – నేనురాను. నీవుపో—

వెంక – మీగౌరవమేమి? మీయధికారమేమి! మీరిల్లు వడువీధిలో కూర్చుండిన నవ్వులాటగా నుండదా!

కొండా – నన్నిప్పు డెక్కడికి రమ్మనెదవు?

వెంక – మీయింటికి.

కొండా – నాకింక నేమున్నది?

వెంక – ఇక్కడమాత్రమేమున్నది ?

కొండా— ఇక్కడను లేదు – ఇంటను లేదు – ఎక్కడను లేదు. నా వ్యవహార మంతయు గంద్రగోళమునఁ బడిపోయినది. చల్లని గాలి వచ్చుచోటికిఁబోయి యీరాత్రి గడపి వచ్చెదను. నీవింటికిఁ బొమ్ము.

వెంక—ఒంటరిగఁ దిఱిగెదరా— ఈరాత్రి— అయ్యయ్యో! అమావాస్య చీకటియే— పామో— తేలో—

కొండా—నీవు నన్ను మఱింత యల్లఱిచేయుచున్నావు. వెళ్లు. (లేచి నడచును)

వెంక—(పోవుచుఁదనలో) అది కాళ్లపైఁ బడినన్నాళ్లు కాలఁదన్నినాఁడు— మించిపోయిన తరువాత— మిడుకుచున్నాఁడు.

కొండా—వెంకన్నా! ఇటురా—ఈపాదరక్షలు నా గమనము నాటంకపఱచుచున్నవి. నాకీ యుత్తరీయమువలన చెమ్మటపోయుచున్నది— దీనినిఁ గొనిపోయి నాయింటనుంపుము— ఇంకొక్క

మాట— ఈచీటినిఁ గొనిపోయి కారాగృహాధికారి కిచ్చి వీర భద్రను విడుదలచేయుమని చెప్పుము. (వ్రాసియిచ్చును)

వెంక—అయ్యోయో! వీరభద్రినే! కొండారెడ్డిగారూ! మీకీనాడు వెఱ్ఱియెత్తినదా యేమి?

కొండా—దుర్మార్గుడా! నీకదియేల! వెళ్ళెదవా! లేదా?

వెంక—(భయముతో నిష్క్రమించును.)

కొండా - (తలపంకించుచు) ఛీ! ఛీ! ప్రపంచ మింత కపటభూయిష్ట మని యెఱుంగక మూఢుఁడనై చెడితిని! ఎన్ని యిచ్ఛక ములు! ఎన్ని నైచ్యాను సంధానములు - ఎన్ని పరిహాసము లాడి తుదకెట్టి జారిణీకృత్యమునకుఁ బాలుపడినది! పరమే శ్వరా! నన్నిట్టి భయంకర నారీపిశాచముల బారింబడకుండఁ గాపాడుము. ఇట్టి ప్రేమయందే ఇట్టి భీకరమగు మోసము సంఘటన్నమై యున్నప్పు డిఁక మిగత యోఁడువాండ్ర లెక్క యేమి? ప్రపంచమున సత్యప్రవర్తనము గల యోఁడుది లేదు_ లేదు - ఇది నిర్ధారణము - నిస్సంశయము - ప్రణయమా! నీకొక నమస్కారము -నేనీ జగమున మరణించునందాక స్త్రీ జాతిని విశ్వసింపను_విశ్వసింపను! వీరభద్రియు నన్నుపూర్ణయు నేమైననగుదురు గాక! వారి ప్రశంస నాకు వలదు_వలదు. నేను వివాహమాడక బ్రహ్మచారినై యుందును గాక! ఓ ప్రపంచజనులారా! మీరందఱును నావలెనే - ఆడుజాతిని నమ్మి మోసపోక మెలఁకువగల్గి ప్రవర్తింపుఁడు - ఈపయో ముఖ విషకుంభములపాలికిఁ బోకుఁడు. ఈతృణచ్ఛన్న మహా గర్తములలోఁ గూలకుఁడు. ఈతేనెపూసిన కత్తులను తాక కుఁడు. ఈకప్పకూత పాములనోటఁ బడకుఁడు, ఈగోముఖ వ్యాఘ్రముల దరియకుఁడు! జాగ్రత్త!! జాగ్రత్త!!!

సీ. మగడు నిదిరింప మార్మగనితో నేక శ
య్యానె మారవిక్రీడ లాడువారు
పరపూరుషులకయి ప్రాకులాడుచు విష
మిచ్చి భర్తల మడియించువారు
పతిని బొమ్మనుఁ జేసి పరులతో నాతని
యెదుటనే బూతులు వదరువారు
వంటయింటికి భర్త నంటించి వాఁకిఁట
జేరి కచేరీలు సేయువారు

గీ. సదయులౌ భర్తలనుఁ గొట్టి శక్తులట్టు
లిల్లు తలకెత్తుకొని బిగ్గ నేడ్చువారు
శంకిణీజాతిముండల సరసఁబోక
మేలుకొనరయ్య! మనరయ్య! మిత్రులార!!

(నిష్క్రమించును.)

చతుర్థాంకము సంపూర్ణము.



# ధరణికోట



—• రెడ్డివీరుల సంగ్రామక

## పంచమాంకము

### 1 వ రంగము

(రాచకొండలో నొక గృహము)

(పఠాను వేషములతో ఖడ్గనారాయణ, మల్లినాధ, కృష్ణరాజులుప్ర॥

ఖడ్గ—మిత్రులారా! ఈ పఠానీ వేషములవలన మనము మన నిజాకృతులు గురుతింపబడని చందమున ననపోతనాయని వంచించి యాతనివద్దనే - సేనాధిపతులమై మిగుల ప్రాపకము సంపాదించుకొని కృతార్థుల మైతిమిగదా? ఇక మన చాతుర్యముచే కొండారెడ్డికిని, అనపోత నాయనికినివిరోధము గల్పింప గలిగితిమా మనకోరిక సంపూర్ణ మందినటులే.

కృష్ణ—అందులకు వెంకన్నగాడి సహాయముం గొనుట శ్రేయము. మొన్న నొకనాడు నేను వానికి గొంచెము సురారసమునిచ్చి ప్రేలించితిని. సురగాని, ధనముగాని, యొక పడుచు పిల్లగాని వానికి దొరికినచో నెంతపనియైనం జేయుటకు వెను దీయడు.

ఖడ్గ—అట్లయిన నీ మూడింటి చేతను వానిని వశపరచుకొందము.

మల్లి—ఆ సంగతి గురించియే రెండు సారాయిబుడ్లను సిద్ధపరచి యుంటిని.

ఖడ్గ—మల్లినాథా! నీవు బుద్ధిశాలి వగుదువు.

కృష్ణ—అదుగో – అనుకొన్న వేళకు వెంకన్నయు నిట్లే వచ్చుచు
న్నాడు. మనము కార్యారంభ మిప్పుడే చేయవచ్చును.

(పాదరక్షలును, ఉత్తరీయమును, చేత బట్టుకొని వెంకన్న ప్రవేశము)

వెంక—పఠాణీ సాహేబులకు సలాములు – ఇక్కడ నేదో పనిమీద
నున్నట్టున్నారు.

ఖడ్గ—ఏమున్నది? వెంకన్నా! కొంచెము హుషారీకొరకు మధురసం
సేవించుచున్నాము.

మల్లి—(బుడ్డిని బయటకు దీయును)

వెంక—(గుటకలు మ్రింగి) నిండుగానే ఉందే!

కృష్ణ—ఇది రెండవది. ఒకటి ఇదివర కూదివేసినాము.

మల్లి—వెంకన్న కలవాటు లేదు కాబోలును.

వెంక—ఆ – అలవాట్ల కెక్కడికి లెండి! మీ వంటి గొప్పవా రను
గ్రహిస్తే అప్పుడప్పుడు – ఎరుఁగనా?

ఖడ్గ—అట్లయిన మొగమాటము లెందులకూ! మరి రా.

వెంక—కానీయండి – కానీయండి – మీరంతా ఐనాక – అడుగున
మిగిలితే – ఒక్క చుక్క – మీ దాసుఁడుగూడా గొంతుక
జారుస్తాడు.

మల్లి—మా దంతా అయిపోయింది. ఇదంతా నీకోసమే. ఇంద– రా.

కృష్ణ—వెంకన్న కీ యొక్కబుడ్డి చాల దనుకుంటాను.

వెంక—ఏంజేస్తాము – ఏదో! అంతే చాలులెండి.

ఖడ్గ—అంత చాలీ చాలని వ్యవహార మెందుకు? మేము పఠాణీలము
– తెలిసినదా? ఇంటిలో నిట్టి పింకను సీసాలతో మూల్గుచున్న
వి. నీ యిష్టము వచ్చినంత త్రాగవోయ్.

వెంక—ఇవ్వాళ నే నేదో నక్కని తొక్కి వచ్చుంటాను, (తీసికొని తాగుచు) వారెవా! ఎంతగాటు - ఎంత కమ్మదనం! మంచి యిప్పపువ్వు - సారాలాగుందిరా బాబూ.........ఎన్నాళ్ళనుంచో కొండారెడ్డిగారి దగ్గరున్నాను. గాని నవాబు సాహెబులూ — వారెప్పుడూ యింత మజాఅయిన గొంతుతడి చేయించ లేదంటే నమ్మండి.

ఖడ్గ—కొండారెడ్డి యిప్పింపకున్న నేమి? మీ రాజుగారి కభ్యాసమే గదా?

వెంక—రాజుగారా! ఆఁ—యేమి తాగడం లెండి. బోలెడు డబ్బు తగలబెట్టి విదేశపు సారాయి కొంటాడు. అరబుడ్డితో హతమై పోతాడు. (నిషాచేత తూలుచు చేతిలోని పాదరక్షలను ఉత్తరీయమును క్రిందబడవేసి మరల తీసి చేత బట్టుకొని) కొండారెడ్డి చంపేస్తాడు. బాబూ వెళ్ళాలి— ఇక శలవు.

ఖడ్గ—వెంకన్నా! ఏమంత తొందర? కొండారెడ్డి నిన్నేమి సేయఁగలడు?

మల్లి—(మరియొక బుడ్డిని విప్పిచుంచును)

వెంక—(బుడ్డివంక జూచి గుటకలు మ్రింగుచు) ఏమన్నడానికి ఏమి పానిజేశాను? గాని.........బాబూ! అదికూడా ఇందాకటి రకమేనా కొత్తదా?

ఖడ్గ—రుచి చూడవోయ్! నీ కభ్యంతర మేమిటి?

మల్లి—(ఇచ్చును.)

వెంక—(తాగి హుషారిచే)

—♦ పాట ♦—

కల్లే తాగాలె వోరెల్లిగా ॥క॥
సారాయి మనకీ సరిపడదురా ॥క॥

కట్టకల్లు ఫస్టుకలాస్ పిట్టకల్లు నాన్ సెన్స్!
బ్రాంది విస్కీ దీనికాడ బలాదూర్ మజాదాన్ ॥క॥

ఖడ్గ—(అపహరించి) కృష్ణరాజా! వీరికి కైపు తలకెక్కినది. మిగత యాశలను రెంటిని తెలివి యుండగనే చూపినచో వీనిచే నెంత పనియైన చేయింపవచ్చును.

కృష్ణ—(అప॥)ఔను (ప్రకాశముగ) వెంకన్నా! ఈ రత్నహారమును చూడు. ఇది నీ ముసలి గడ్డమునకు క్రిందుగా మంచి యందము నిచ్చును సుమా!

వెంక—అబ్బో... ఇది నా కెందులకయ్యా! గొప్ప మహారాజులు వేసుకొనేది?

మల్లి—కాదు; కాదు; వెంకన్నా! నీవు పెండ్లికొడుకువు కాబోవు చున్నావు; గనుక—నీకిది తగినదే.

వెంక—పెండ్లికొడుకా! అబ్బో—అబ్బో—పెండ్లెక్కడిది?

మల్లి—ఒక్క పిల్లమాత్రమే యనుకొన్నావా? రెండువేల రూపాయలతో ఒక పీపా సారాయితో నీకొక పిల్లను పెండ్లిచేయదలచినాము.

వెంక—హత్తెరే—అదృష్టమంటే విష్ణుచక్రంలాగ—అలా—గిరున తిరగాలె. పఠాణీబాబులూ! అయితే ఈ ఉత్తరీయము—చెప్పులూ కొంపలో పారేసి పెళ్ళికొడుకునై వస్తాను.

ఖడ్గ—వెంకన్నా! ఈ చెప్పులెవ్వరివి? ఉత్తరీయ మెవ్వరిది?

వెంక—కొండారెడ్డివి.

ఖడ్గ—అతని యిల్లు దూరమా? దగ్గరా?

వెంక—కొంచెం దూరపుమాటే—

ఖడ్గ—ఐతే వద్దు. పెళ్ళి సుముహూర్త మింక నెంతోసేపులేదు. ఈ సమీపమం దెవ్వరి యిల్లు వున్నది?

వెంక—రాణిగారి అంతఃపుర మిక్కడికి దగ్గర.

ఖడ్గ—సరే! ప్రస్తుతము ఈ చెప్పులను ఉత్తరీయమును రాణి యంతఃపురమునం దుంచుము. కొండారెడ్డిదిగాని మరియొకటి గాని మంచి యంగరఖా నున్నదా!

వెంక—ఓ! కొండారెడ్డిదే యున్నది. ఐతే—కొంచెము మాసినది చాకలికి వేయుమనగా - నావద్ద నుంచితిని.

ఖడ్గ—మాసిన నేమిలే? దానిని నీవు తొడుగుకొని పెండ్లికొడుకువై రాణిగారి యింట నుండుము. మేమచ్చటికి వచ్చి నీకు పెండ్లి చేయుదుము.

వెంక—రాణి కోపడితే?

ఖడ్గ—వెర్రివాడా! రాణియే - తానొక పిల్లను పెంచి నీకిప్పుడు పెండిలి చేయనున్నది.

వెంక—మీ రక్కడి కెలా వస్తారు? రాణికి ఘోషాకదా?

ఖడ్గ—నీకెందుకు! నీవు వెళ్ళుదూ! — మేము క్షణములో వచ్చెదము.

వెంక—ఓ! అయితే క్షణం ... (ఎగురుచు) పెండ్లికొడుకునౌతాఁ పెళ్ళిచేసుకుంటాఁ— పిల్లల్ని జల్లల్ని పోషించుకుంటాఁ—

(నిష్క్రమించును)

ఖడ్గ—మిత్రులారా!

గీ. వంచనమున మనకు వశుడయ్యె వెంకన్న
తంత్రములను బన్ని ధరణినాధు

మనసు విరిచి రాణికిని కొండరెడ్డికి
రంకు గూర్పవలయు; నింకమీద

(అందరు నిష్క్రమింతురు)

(2 వ రం గ ము)

(అనపోతనాయఁడు విశ్రాంతి మందిరమున సారాయిముందుంచుకొని ప్రవేశము)

(3 వ అనుబంధము)

అన్న—(త్రాగబోవును)

(పఠాణీలు ముగ్గురు ప్రవేశము)

ముగ్గు—సలాము—రాజచంద్రమా!

అన—(సత్వరముగ బుడ్డిని దాచి) సలాం—పఠాణీలు రండు— కూర్చుండుడు మీకు సేమమా?

ఖడ్గ—మా క్షేమము తమ క్షేమము తరువాతది గదా?

అన—నా క్షేమమున కిప్పుడేమి కొరత?

ముగ్గు—(మొగములు జూచుకొని నవ్వుకొందురు.)

అన—నన్నుగాంచి మీరిట్లేల నవ్వుకొందురు?

ఖడ్గ—మహాప్రభువు చిత్త మెట్లుమసలిన సేవకులట్లు వర్తింపవలసిన వారేకదా! - మంచియైన చెడ్డయైనను తమకు వచియించుటకు మేము శక్తుల మగుదుమా!

అన—మిత్రులారా! మీరు నావద్ద ప్రవేశించినప్పటినుండియు—నేను మిమ్ములను పరిజనులను వలె చూడక నాప్రాణమిత్రులను

వలెనే చూచుచుంటినే - నాశ్రేయము నభిలషించి వచించు పట్ల - మీకు సందేహమేల?

మల్లి—సందేహమన్న - అంతయు సందేహమే! ఏమందురా!

గీ. ప్రభుల చిత్తంబు లిచ్ఛాప్రవర్తకంబు
లగుట కనుగల్గి మెలగంగ నగును మాకు
సర్పములతో చెలిమిగా స్వామి చనువు
ప్రభువు చిత్తంబు నీరదవర్ణ సమము.

అన—మీ మాటలనుఁబట్టి చూడగా - నేను కన్నులు మూసికొని యంధుడనై-నాకు బఱుగుచున్న మహాద్రోహము దేనినో - యెఱుంగక సంచరించుచున్నట్లును - దాని నెఱింగిన మీరు నాశ్రేయమునుఁ గోరి కొంతయు, నాకు భీతిల్లి కొంతయు, చెప్పుటకును, మానుటకునుఁ గూడ నోరాడక తల్లడిల్లు చున్నారనియు నాకుఁ దోఁచుచున్నది. విశ్వాసపాత్రులైన మీరే - నాయమానుషము నిట్లు - దాఁచినప్పుడు నా హిత మును గోరువారిఁక నెవ్వఱుందురు? కావున ఈగర్భితమైన భయంకర రహస్యమును నాకు మీరు తెలుపకతప్పదు.

ఖడ్గ—రాజేంద్రా! అమానుషమేమో కల్గుచునేయున్నది. చెప్పక తప్పదని మేమెఱుఁగని విషయమునుగాదు. ఐనను మాకు తమరు ప్రభువులుగాక మిత్రులైనచో నీపాటికి చెప్పియే యుందుము. ఏమందురా—

గీ. సమాజమున దోహి, యనృతవచస్కుఁడగును;
తన యకార్య మతఁడు క్రియుఁకొనఁ దలంచి
కల్లలనుఁబల్కి మాపై నఘంబు మోపఁ
జేయునదియేమి? మీచేతి శిక్షతప్ప—

అన—పఠాణులారా! తొలుత నుండియు, మీ సత్ప్రవర్తనమును, కన్నులారఁ గనుచున్న నే నెవ్వని మాటలనో నమ్మి—మీపై తప్పు దలంతునా? మీరునాకు సప్రమాణముగ వాని యప రాధమును నిరూపింపుఁడు – వానిని ఋజువుచేయుఁడు. అట్టి ద్రోహిని నిలువునఁ జీల్తునుగాని—

(34 వ అనుబంధము)

మల్లి—మహారాజా! అతఁడు మాకన్న పూర్వమునుండియు తమ్ముఁ గొల్చుచున్న వాఁడుగదా! వాని మాటల యెదుట – మా మాటలు పాటియగునా!

అన—అట్లయిన నావద్ద పూర్వమునుండి యున్నవాఁడే నాకు ద్రోహము దలపెట్టినాఁడా!

ఖడ్గ—మహారాజా! నూతనుల కంతటి సాహసముండునా!

గీ. మృగయునకుఁ గాక మృగమర్మ మెఱుఁగ బడునె?
జాలరికిఁ గాక తెలియునే జలచరముల
యునికి? రాజాశ్రితుఁడు గాక యున్న రాజ్య
మర్మము లెఱుంగఁబోలునే మానవేంద్ర!

అన—నా యాశ్రితులలోననే, నాకు ద్రోహమును సంకల్పించు వారుగలరా! మిత్రులారా! నేనింతకాలమునుండియు, నొక ద్రోహిని, మహావిశ్వాసపాత్రుఁడనియెంచి మోసపోయితినా?

మల్లి—రాజేంద్రా! అది ప్రకృతి ధర్మమేకదా? ఆశ్చర్యమేమి?

గీ. వేశ్యనే నమ్ము; సతియని విటుఁడు సతము
అనిమిషము నమ్ము – గాలంపు టామిషమునె
జనకుఁడని నమ్ము, గటిక వానినె యజంబు
పృథ్వినాథుఁడు ద్రోహినే విశ్వసించు.

అన—మీ యుపన్యాసముల నింక చాలించి సత్వరము వాఁడెవ్వఁడో చెప్పెదరా లేదా?

ఖడ్గ—మహాప్రభూ! మేమొక ప్రశ్న వేసెదము. మా సాహసమును మన్నించి యుత్తరమిచ్చెదరా!

అన—ఆఁ - అడుగ వచ్చును.

ఖడ్గ—కాకులకును గ్రుడ్లగూడలకును మైత్రియేనా?

అన—మైత్రియెక్కడిది! బద్ధవిరోధమే కాదా?

ఖడ్గ—అట్టి బద్ధవిరోధముకల గ్రుడ్లగూబకు అర్ధరాత్రి తన వృక్షమున చోటొసంగిన కాకి నేమనవలెను?

అన—బుద్ధిలేని దనవలెను.

ఖడ్గ—క్షమింపుఁడు. మీకును రెడ్లకునో?

అన—నీ వెఱుంగవా? మాకును రెడ్లకును, నడుమ పచ్చిగడ్డి వేసిన భగ్గున మండిపోవునుగదా!

ఖడ్గ—అట్టి రెడ్లను విశ్వసించి తమరు చేరనీయవచ్చునా?

అన—అట్లు నావద్దచేరి నాకు ద్రోహము సల్పఁబూనిన వీరారెడ్డికి శిక్షయైనది గాదా?

ఖడ్గ—ఇంకెవ్వఱును లేరా?

అన—కొండారెడ్డి యున్నాఁడు.

ఖడ్గ—రాజేంద్రా! తెలియక యడుగుచున్నాను. మీరావనా రెవ్వరైన రెడ్లను గొలుచుచున్నారా?

అన—లేదు.

ఖడ్గ—అట్లయిన నాతఁడు మీాపక్షమం దేల చేరెనో విచారింపక, మన్నించి యధికార మీాయవచ్చునా?

అన—ఐననేమి? ఆతఁడేమైన నారాజ్యమునకును నాకునుద్రోహము చేయనున్నాఁడా?

ఖడ్గ – రాజ్యమునకే యననేల ... ... ... ... రాజేంద్రా! అంతఃపుర రక్షణమునందలి భారము నెవ్వరిపై నుంచినారు?

అన – కొండారెడ్డి పైనే.

ఖడ్గ – వెంకన్నకును, అతనికిని శత్రుత్వమా!

అన – కాదు. వాఁడాతనికిని నాకునుఁ గూడ నమ్మినబంటు.

ఖడ్గ – వాఁ డంతఃపురమున నిరాటంకముగఁ దిఱుగునా?

అన—ఆఁ వృద్ధుఁడగుట చేత.

ఖడ్గ—కొండారెడ్డి కంతఃపుర సంబంధమును వదలించిన వచ్చు నపాయమేమి?

అన—ఉఫ్! పఠాణీ! ఏమి నీ సంభాషణము? వా డంతఃపురమున నేమి చేయుచుండెనో తెలుపుము! శిక్షింతుము. వాడు దేని నయిన నుంచుకొనెనా?

ఖడ్గ—మహాప్రభూ! ఎవ్వరినో యుంచుకొనిన మాకింత దుఃఖమేల?

అన—ఆఁ—ఆఁ—నా భార్యనే యుంచుకొనెనా?

ఖడ్గ—ఆ మాటను మేము చెప్పుటకు సాహసింపక దాఁచినంత మా త్రమున దొంగతనమును, రంకుతనమును దాగునవియా రాజేంద్రా!

అన—(ఆలోచించి తలపంకించి) నే నిది నమ్మను. నే నిద్ది నమ్మను.

గీ. ఎన్నిదినములనుండియో యితడు నాకు
నెరపిన మహోపకారంబు మరువ గలనె?
యిపుడు నా సతితోడ వాఁడిట్లొనర్చె నవిన
నవిన, నమ్మకయుండె మదాత్మ హితుఁడ!

ఖడ్గ - మహారాజా! "ద్రోహినే నమ్మ మనుజనాథు" డని మే మన్నమాట కిప్పుడే తార్కాణముగంటిమి. మాకేల? మిత్రులారా! రండు పోవుదము-ఈ యమానుషము మాతురకలలో జరిగిన నుప్పాతర వేయింపమా?

(ముగ్గురు పోఁబోవుదురు.)

అన—నిలుఁడు. మీరెక్కడికి బోయెదరు? వాఁడు ద్రోహియగునో కాదో నాకెఱిఁగింపుఁడు.

ముగ్గురు—(35 వ అనుబంధము.)

ఖడ్గ—అగునని కాదని, ఇప్పుడీవితర్క మేల?

అన—అట్లయిన, మాకు నిదర్శనముఁ జూపఁగలరా?

ఖడ్గ—దేవిగారి యంతఃపురమున కిప్పుడే రావచ్చును.

అన—అట్లయిన రెండు. (అందరు నిష్క్రమింతురు.)

3 వ రంగము.

(రాణియంతఃపురము)

(రాణి నిద్రించుచుండును; పెండ్లికొడుకు వేషముతో కొండారెడ్డి యంగరఖా తొడుగుకొని వెంకన్న ప్రవేశము.)

వెంక—రాణిగారు నిద్రపోవుచున్నారు. కొండారెడ్డి యుత్తరీయమును పాదరక్షలు నిందుంచెదను. కొండారెడ్డి యంగరఖా తొడుగుకొని నేనిప్పుడు పడుచు పెండ్లికొడుకనైతిని. పతా

ణీలు వచ్చినవెనుక రాణిగారిని లేపవచ్చును. నేనును కొంచె మిచ్చట నడుమువాల్చెదను. (పరుండును.)

(మల్లినాథుఁడు శీఘ్రముగ ప్రవేశము.)

మల్లి—(వెంకన్నను లేపి) వెంకన్నా! రాజుగారు వచ్చుచున్నారు. నీ యంగరఖాను—పెండ్లికొడుకు వేషమునుఁ జూచి యాగ్ర హింతురు. పారిపొమ్ము.

వెంక—(తత్తరపడుచున్నాడు.)

మల్లి—ఈ గవాక్షమునుండి పాఱిపొమ్ము.

వెంక—(పారిపోవుచుండును.)

(అనపోత ఖడ్గనారాయణ కృష్ణరాజులు ప్రవేశము.)

ఖడ్గ—రాజునకు వెంకన్న పారిపోవుచుండగా కాన్పించు వెనక భాగమును-పాదరక్షలు—ఉత్తరీయమును చూపును.)

పఠాణీలు ముగ్గురు—(నిష్క్రమింతురు.)

అన—(రాణిని నిద్రలేపి) ఓసీ! కులటా! 'ఏటికి దొంగనిద్ర పోయెదవు' లెమ్ము.

రాణి—ఏమిది! అర్ధరాత్రమున నాగ్రహముతో వచ్చినారు?

అన—ఆగ్రహమా! ఆగ్రహము నీకు పట్టుటచేత వచ్చిన దాగ్రహము.

రాణి—ఆ గ్రహమేమి?-ఈక్రోధమేమి?

అన—ఛీ! కులటా! ఎఱుఁగనట్లు నటింపనేల?

గీ. కులట! నే జచ్చితినటంచుఁ దలఁచినావొ
కొండరెడ్డి నీ ప్రక్కలో బండియుండఁ

గులుకుచుం బతివ్రతవిధానం బలికెదొర !
నిలువు మింకనిన్నుం గోసి కండలుగం జేతు.

రాణి—హరిహరీ! ఎంత పాపపు దినము!

అన—నీపాపపునోట హరినామ స్మరణముకూడనా? పాంసులా
కొండారెడ్డి యుత్తరీయమును పాదరక్షలు నిందేల యున్నవి?

రాణి—నేనేమి యెఱుంగుదును!

అన—కొండారెడ్డి యిప్పుడు గవాక్షద్వారంబున బారిపోవు చుండగా నేను చూడలే దనుకొంటివా?

రాణి – ఛీ! ఛీ! ఎంత యనృతాలాపములు? మధురసం బేమైన సేవించితి రాయేమి?

అన – ఏమంటివే! దుష్టురాలా! నేను త్రాగివచ్చి నిన్ను తిట్టుచుంటి ననుచుంటివా! నీజారిణీత్వము నేల కప్పిపుచ్చికొనెదవు? నీకు వానితో నేటి సంబంధము?

(36 వ అనుబంధము)

రాణి – నాకేమి సంబంధ మాతనితో? – నాకీ తర్జనభర్జనము లేమి తెలియును?

అన – తెలియదా! తెలియదా! నిన్ను ఖండించినం దెలియును. ఇటు రమ్ము. నిన్ను వదలను (జుట్టుపట్టుకొని)

గీ. ఇంత దుష్కార్య మెంతటి హీనజాతి
యందయినం గల్గంబోవదో యధమురాల!
రాచకొలమునం బుట్టి దుర్గతిని నాదు
గౌరవము గంగంగల్పితే కామబుద్ధి!!

రాణి - (వదలించుకొని) ఓబుద్ధిహీన నరపాలాధమా! ఏమి నీ యున్మత్తత! ఎవఁడో చేసిన మోసమునఁబడి నన్నేల వృథానిందఁ గావింతువు? ఛీ! ఇట్టి నీకా - రాజ్యపాలనము! నీవంటి యధమాధమునకా నేను సతిని! పొమ్ము - నీకు జ్ఞానమెక్కడిది? నీకు రాజ్యమేలు శక్తిలేకున్న నేను సర్వకార్యములను సమర్థించు కొందునులే. తాగి పరుండుము. నీ మొగము చూడరాదు. నీతోనేమి? (నిష్క్రమించును.)

అన - (రోష విషాదములతో కూర్చుండి) నామతి చెడిపోయినది! నాకు వెఱ్ఱియెత్తినది. ఏమి యీకల్లోలము? ఏది యనృతము? పఠాణీలు ద్రోహులా? కొండారెడ్డియు, రాణియు ద్రోహులా? పఠాణీలు ద్రోహులయిన నీపాదరక్షలను ఉత్తరీయమును నేమనవలయును? కాదు - కాదు - ఈ కులటయే యనృతాలాపిని. జగజంత — శంకిని — ఆ దుష్టుఁడే రాజద్రోహి - యంతఃపురద్రోహి- నామతి చెడినది- నాకేమియుఁ దోఁచుట లేదు. అంతయు నంధకారమై పోయినది! ఇప్పుడేది కర్తవ్యము? ఓరీ! వెంకన్నా! వెంకన్నా!

వెంక—[భయముతో ప్ర॥]

అన—ఆ దొంగనడక లేమి? ఇటురమ్ము.

వెంక—చిత్తము.

అన—సారాయము నందిమ్ము.

వెంక—అందించును.

అన—(తాగి) నీవు రాణికిని, కొండారెడ్డికిని రాయబారములు నడుపుచుంటివా?

వెంక—నాకేం దెలుసును స్వామీ!

అన—కొండారెడ్డిని నేనిందాక నీగవాక్షద్వారమున పారిపోవు చుండగా చూచితిని - నీవెన్నడైన వానికి రాణితో సంబంధ ముండుట నెఱుంగుదువా?

వెంక—(వెలవెలబోయి ధైర్యముతో) కొండారెడ్డిగా రొంటరిగా రావడ మెఱుంగుదును.

అన—నాతో నేల చెప్పలేదు?

వెంక - రాణిగారికోస మొస్తున్నాఁడని నాకేమి తెలుసును స్వామీ?

అన - సరే! వానిని పిలుచుకొని రమ్ము.

వెంక - (ధైర్యము కొంచెము కొంచెము తాగి నిష్క్రమించును)

అన - (కోపముతో) ఇఁక నేమి? వెంకన్నయు ననేకసారులు వాని నీయంతఃపురమున చూచెనట. ఈసంబంధ మన్నృత మెట్లగును? (మఱల తాగి) రానిమ్ము - వాని నేమిచేసెదనో!-ఫిరంగితో నఱికెదను. భీముడు హిరణ్యాకశ్యపుని చంపినట్లు చంపెదము - నాతో పరిహాసములా - రాణితో సరసములా? - ఏమను కొనెను? రానిమ్ము - రానిమ్ము.

(కొండారెడ్డిని గొనివచ్చి వెంకన్న నిష్క్రమించును)

కొండా - మహాప్రభూ! వందనము.

అన - ఎవఁడురా మహాప్రభువు?

కొండా - (తనలో) ఓహో! తాగియున్నట్లున్నాఁడు (ప్రకా) తమరేస్వామీ!

అన - నాభార్య పరిక్రన్ను బరుండి - నీవు మహారాజువైతివిగాదా! నేనేయిప్పుడు నీ సేవకుఁడను - నాకేల వందనము లర్పిం చెదవు? కొండారెడ్డి మహారాజుగారూ! ఈ హీనుఁడు అధ

మాధముడు మిాభృత్యులు అనపోతడు నమస్కరించు చున్నాడు.

కొండా - (తనలో) ఎంతతాగినను నన్నెన్నడిట్లని యుండఁడే? ఏమి చిత్రము!

గీ. కుమతు లెవరైన నాపైనఁ గొండెములను
బలికియుందురో! కాక యీ పుడమిపతికి
హృదయ మేమైన చలియించెనేమొ కాని
కాంచ నెన్నడు నిట్టి యకాలబుద్ధి.

అన - ఓరీ! ద్రోహీ! - నాకు మహాపకారము గావించి యేమియు నెఱుఁగనట్లు చింతించుచు, నిలువఁబడియెదవటరా పాపీ! ఇటురమ్ము-ఎన్నిదినముల నుండియు నిరంకుశముగ-నిరభ్యంత రముగ - నిరాక్షేపణముగ - దానితోఁగులుకుచుంటివో చెప్పుము - అనపోతనాయని గుడ్డివానినిజేసి యెన్నినాళ్ళు నీ అంకుతనము సాగింపవలె ననుకొంటివి - రాజద్రోహీ! - మోహచిత్తా? - పాపపంకిలా! ఇదిగో కరవాలము.

కొండా - (తనలో) కార్యము మించియే వచ్చినది!

అన - (కత్తిలాగి) మాటాడవేమి పశువా?

కొండా - రాజేంద్రా కత్తిఝుళిపించుటకేమి? నావద్దను కరవాలము గలదు - (కత్తిలాగి) న్యాయాన్యాయము లారయక - అకారణముగ దూషింపకుము.

అన - ఓరీ? నాపై కరవాలము లాగెదవా? నాభార్యతో చేయు అంకుతనము చాలక నన్ను చంపుటకు సయిత మాయత్త పడెదవా? ఏమనుకొంటివి? యనపోతఁడు ప్రళయకాల రుద్రుఁడని తెలియవుగా? బ్రహ్మాండము లన్నియు వెదకి నను నాకరవాలము నెదిరించు నాయుధములేదు. నన్ను

జయించువాఁడు లేఁడు. ఈలోకము నాది- లోకములను నేను జయించితిని. అందులోని పందవు నీవు..

కొండా - ఏమి! యీాయవ్యక్తాలాపములు! ఓరాజా! నీభార్యకును నాకును సంబంధమని చెప్పుచుంటివి. ఈపాపవాక్యములను నేను వినలేకున్నాఁడను. నాకీ కట్టుకథ యర్థమగుట లేదు. కాని యిది వినుము.

గీ. రాజవిద్రోహ రాజదారా రతంబు
లరయ మా యింటి కుక్కలకైన లేవు
సదమలంబైన రెడ్డివంశమునఁ బుట్టి
నట్టి నేనిట్టి పనికేల నను మతింతు?

అన—అటులనా? అటులనా? తులువా! నీవు కుక్కకన్న నధముఁడ వురా! అందులకే ఇట్లు చేసితివి.

కొండా—అనపోతా! నిజమే— కుక్కకన్న నధముఁడ నేయగుదును— ఏలనన.

గీ. రెడ్డికులమునఁ బుట్టి యీారీతి నిన్నుఁ
బోలు తులునను గొలిచిన బుద్ధిహీన
గుణముగల నేను నిజముగ కుక్కకన్న
నధముఁడ నటంచు నిజ మిప్పు డరసినాఁడ.

అన—ఈ శ్రీరంగనీతుల కేమిలే? ఈ పాదరక్షలు. నుత్తరీయము లెవ్వరివి?

కొండా—నావే.

అన—నా యంతఃపురమున కెట్లు వచ్చెను?

కొండా—ఆహా! తెలిసె! ఇది తుచ్ఛుఁడగు వెంకన్న మోసము!

అన——వెంకన్న మోసమని పలికి——యేల క్రమ్మకొనఁ జూచెదవు? నేను స్వయముగ నిన్ని గవాక్షమునుండి పారిపోవుచుండఁగా చూడలేదా!

కొండా——రాజా! తొందర పడితివి. ద్రోహుల మోసమునఁ గూలితివి! ఆలోచించుకొమ్ము. అన్యాయములాడి నన్ను ద్రోహమునకు——బ్రేరేపింపకుము.

అన——యేమిరా పేలెదవు? దుష్టుడా! రెడ్డిభూతమా! ద్రోహివై——నా కొంపనుదూరి నా భార్యతో వ్యభిచరించు చుంటివా? నిన్ను చంపెదను.

కొండా——నీ వి ట్లధర్మమున కుద్యమింపఁగానే——నే వ్యర్థుడ ననుకొంటివా? రమ్ము.

(37 వ అనుబంధము)

(కొండారెడ్డి అనపోత నాయుని చంపబోవును. ముగ్గురు పఠాణీలు వచ్చి కొండారెడ్డినినణచి పట్టుదురు.——వీరభద్ర, కళాపూర్ణ విక్రమరాజులు వచ్చి ముగ్గురు పఠాణీలను ఎదుర్కొందురు. అనపోతనాయుడు భీతిల్లును — కొండారెడ్డి విముక్తుడగును. (తెరవ్రాలును)

పంచమాంకము సంపూర్ణము.

——o——

# ధరణికోట



## —♦ రెడ్డివీరుల సంగ్రామకథ ♦—

## షష్ఠాంకము

### 1 వ రంగము

(అడవిదారిని వీరభద్ర, కళాపూర్ణ, విక్రమరాజులును కొండారెడ్డి ప్రవేశము)

కొం.—ఓ దయామయులారా! మీ దయచేతనే రక్షింపబడితిని. ఇట్టి మీ రెవ్వరో నేను వినగోరుచున్నాను.

గీ. అనుపమదయాంతరంగుల రగుచు నన్ను
గానవచ్చిన సత్కృపానిరతులార!
రమ్యతావక నామాక్షరములు దెల్పి
చిరము నను ధన్యచరితుని జేయుఁడయ్య?

కళా—ఆర్యా! ప్రతిఫలాపేక్ష లేక రక్షించితిమి. కావున మా నామములతో గాని, మా చరిత్రలతో గాని ప్రమేయము మీ కేమియును వలదు. మాకు సెల విచ్చెదరేని మాదారిని మే మరుగువారము.

కొండా—అయ్యా! ఇది తగునా?

కం. ప్రాణము లొసఁగినవారికి
బ్రాణము లొసఁగంగ దగుః కృపాపరులారా!

మీ నామములను బాంధవు
లైన మిముం గోరఁ దగదే? హానియుఁ గలదే?

విక్ర—అట్లయిన వినుము. ఇతఁడు కళాపూర్ణుడు. - ఇతడు వీర భద్రుడు – నన్ను విక్రమరాజందురు.

కొండా—[సంశయముతో] విక్రమరాజా! విక్రమరాజు.

విక్ర—ఆమాట కర్థము లేదు. ప్రత్యుత్తర మంతకుముందే లేదు.

కొండా—నీవు రాచకొండలో పూర్వము కొంతకాలము వుంటివి గాదా?

విక్ర—ఔను. ఉంటిని.

కొండా—నీకొక భార్య యుండవలెను గాదా?

విక్ర—భార్య కాదు... ...కాని... ...

కొండా—దానిని నీ వుంచుకొంటివా?

విక్ర—ఔను. అన్నపూర్ణ యను నొక యువతిని నేనుంచుకొంటిని.

కొండా—మిత్రులారా! కళాప్రపూర్ణ వీరభద్రులారా! ఈ విక్రమ రాజుతో మీ కెట్లు స్నేహము కలిగినది? పాపముమీరు మం చివారుగ నున్నారే!

విక్ర—వారు మంచివా రనగా ? నేను ద్రోహినా?

కొండా—నా కేమి? అన్నపూర్ణ నన్ను వలచిన దనుమాట లోకమం తయు జెప్పుకొను చుండిరే! అట్టిదానిని నా కెరుక లేకుండ నీ వుంచుకొని నను చుంటివే? నీవు సజ్జనుడవా?

గీ. దుర్జనుండవు మిత్ర విద్రోహి వీవు;
కాముకుండవు – వర్ణసంకరుఁడ వీవు;

ధర్మవిచ్యుత కుటిల వర్తనుడ వీవు;
పాతుడవు గావు మైత్రి కపాత్ర! నీవు.

కళా—చాలు చాలు కొండారెడ్డీ! నీ ప్రాణములు రక్షించినందులకు మాకు మంచి గౌరవ బిరుదము నిచ్చుచుంటివిలే!

కొండా—మిత్రమా! మీ రాగ్రహింప వలదు. మిమ్మేమియు నను చుండుటలేదు.

కళా—మిత్రుల మగు మా ముప్వురిలో నొకరి ననుట నొకటియు - నింకొకరి ననుట యొకటియునా?

కొండా—ఐన - మీ రీతని మైత్రి నేల మానఁగూడదు?

కళా—ఆ మాట చెప్పుటకు నీ వెవ్వడవు? అతఁడు మా మిత్రుడు. అన్నపూర్ణ యెవతయో - నీ వెవ్వడవో మాకేల? కారణ ములేని కలహమున కేల కాలుదువ్వెదవు? వీరభద్రా! విక్రమరాజా! ఇతనితో మనకేటి వాదము? రండు. పోవుదము.

(ముగ్గురు నిష్క్రమింతురు)

కొం—(నాల్క కరచుకొని) అయ్యయ్యో! అకారణముగ వీరి మన స్సులను బాధించితినే? నా దెంత పొరపాటు... అన్నపూర్ణ చావనీ - బ్రదుకనీ అది నాకేల? అంతగా వలచిన యన్న పూర్ణ మరియొక మగవానిని మరిగిననాడే యీ ప్రపంచ మున స్త్రీజాతిని నమ్మరాదనియు, నీ జన్మమున నిక పెండ్లియే వలదనియు, దృఢసంకల్పుడ నైతినే! ఇంకేల నాకీ పాము రము? కాంతావిషయచింతాలేశమును దూరీకృతము గావించి కార్యాంతరము నన్వేషింపవలయును. ఔరా! ఎంతపోతరమా యనపోతునకు! ఎంతనిరాకరణ? ఎంతవిద్రోహం? పరజాతివాడై నది యైన గణింపక తన యుడుగులకు మడుగు లొత్తుచు తన

యభ్యున్నతికై పాటుపడు నన్నా యీ నీచాతినీచవర్తనుడు— ప్రగాఢముగ నవమానించుట! రాణిని నాకన్నతల్లివలె భావించితినే! అట్టి యామెతోడనా నాకీ పంద— సంబంధము గల్పించెను. ఈకొండారెడ్డి గర్భమున నీశాత్రవానల మడికి యుడికి బడబాగ్నియై వీనినినశింప జేయునేకాని— మానునా! ఐనను— వాని ననవలసిన బనియేమున్నది? కులద్రోహ మహా పాతకము నన్నింతవరకు దెచ్చినది! పూజ్యమై ఆంధ్రరాజ్యా లంకారమై - వెలయు రెడ్డివంశమున యేమి? ఒకని పాదము లకు — బానిసతనము చేయుచు నావంశమువారిపై గత్తి గట్టుటేమి? ఇట్టి యఘాత్ముని సేవాఫలమిట్లు విపరీతము గాక యనుకూల మెట్లగును? - ఓ నావంశీయులారా! రెడ్డివీరశిఖా మణులారా! నాతప్పు క్షమింపుడు— నేను మీవాడనే! వంశ ద్రోహిని కాను.

సీ. సదమల రెడ్డివంశమునకు దుష్కీర్తి
సలుప - శాత్రవులనుఁ గొలిచినాను
చిననాటనుండి పెంచిన మేనమామను
భీకరాటవుల కంపించినాను
ఘనబాహుశాలియౌ ఖడ్గనారాయణు
వంచించి చెఱను బెట్టించినాను
విముఖయై యున్నట్టి వీరభద్రునుఁ గోరి
చిరకష్టములకు పాల్జేసినాను

గీ. ఎన్ని జన్మంబు లెత్తి - నే నీ యఘంబుఁ
దీర్చుకోఁగల్గువాఁడనో తెలియరాదు;
దాసు తప్పొక దండంబుతో సరిగద!
నన్ను క్షమింపరె! రెడ్డి బృందంబులార ! !

ఓ జగదీశ్వరా! నీవిశ్వనిర్మాణమున నేనొక పరామాణు మాత్రి జీవ మను- నీవు పశ్చాత్తాప హృదయుల బాలింతువను బిరుదము నిప్పుడు సార్థకము జేసికొమ్ము. మామను అత్తను రాజ్యచ్యుతుల గావించి మహాదరిద్రముల ననుభవింపజేసినపాపము - రెడ్డికులమున బుట్టి శత్రు వులతో నేకీభవించి- రెడ్లకుజేసిన కోపము- పుణ్యాత్ముడయిన ఖడ్గ నారాయణుని బాధించిన పాపము- నన్నిప్పుడు భయభ్రష్టుని జేసినవి. నన్ను క్షమింపుడు- నా రెడ్లు నా యపరాధమును క్షమింపరా? వారు అనపోతనాయునివలె- నన్నెన్నడైన బరాభవింప గోరుదురా? నేనిక శత్రులపొత్తు నంగీకరింపను. అనవేమారెడ్డి పాదములంబడి నన్ను మన్నింప వేడెదను. రెడ్డి విజయమున కాధారభూతుండను నేనెయగు దును గాక! కొండారెడ్డి యిక వెన్నడును కులద్రోహి కానేరడు. అనపోతనాయని మరణ మిక-కొండారెడ్డి చేతనున్నది- ఔరా! ప్రజ్వలితమగు నామనస్సున కిప్పుడింకొక విషయము స్మృతికి వచ్చు చున్నది. నాయధఃపతనమున కా పాపాత్ముడగు వెంకన్నగా కార ణము! నాతిండితిని- నాబట్టకట్టి- పిల్లివలె నాదగ్గరనుండి యాఘ్నుల తంత్రమునకై- వారిచ్చు డబ్బున కాశించి - వారు త్రాగించిన సారాయినీళ్ళు తల కెక్క- నాయింట దాచుమని తనచేతి కిచ్చిన యుత్తరీయమును- పాదరక్షలను- రాణి యంతఃపురమున నుంచి - నాపై రాజున కలుక గల్పించి- యింతపరాభవముచేసిన వాడా ముసలిపీనుగయే! వానిని చంపినగాని నాక్రోధము సగమారదు. ఓరీ! వెంకన్నా! ఇంక నీ ముసలిరక్తమును నాకరవాలము రుచి చూడ నున్నదిరా! నిలునిలు——

(38 వ అనుబంధము)

(వేగముగ - నిష్క్రమించును)



2 వ రంగము. భిల్లాశ్రమము

ఖడ్గనారాయణుని ప్రతిమను, పూజించుచు వీరభద్ర

(కళాపూర్ణుఁడు ప్ర॥)

కళా—సఖ! వీరభద్రా! ఎంతయదృష్టశాలి వమ్మా.

వీర—అన్నపూర్ణా! అదృష్ట మనుమాట నా కెక్కడిదే!

కళా—అట్లయిన నేను నీతో పరియాచకము లాడు చాన నను కొంటివా?

వీర—ఐన - నామహాత్ముని జాడ యేమైన తెలిసినదా యేమి?

కళా—తెలిసికొనకుండ - నీకు నా మొగము చూపనని గదా చెప్పి పోయితిని.

వీర—ఆ - ఆ - నిజముగానా? ఎక్కడ నున్నారు? ఏమి విశేషము?

కళా—భిల్లుల యాశ్రమమునకు కృష్ణరాజను నాత డధికారిగా నున్న మాట నీవెఱుఁగుదువా?

వీర—ఎఱుఁగుదును.

కళా—ఆయాశ్రమముననే - ఖడ్గనారాయణుడు కేదారనాథు డను పేర సన్న్యాసియై యున్నాడు.

వీర—అయ్యో! అట్లయిన, సన్న్యాసాశ్రమ స్వీకారముచేసిన యా పుణ్యాత్ముఁడు నన్ను దయదలంచునా?

కళా—అతడు నీకొఱకే సన్న్యాసి యయ్యెను. నీకొఱకే జపముచేయు చుండెను. నిన్నేల దయదలంపడు?

వీర—నా శరీర మేమో-స్వేదాంచిత మగుచున్నదే! అన్నపూర్ణా! నా కిపుడేది కర్తవ్యమో యుపదేశింపుము.

కళా—కృష్ణరా జాశ్రమమునకు నీవుకూడ నొక బాలసన్న్యాసివై

పోయి - యాతనికి శుశ్రూష చేయుటకన్న కర్తవ్య మేమున్నది? పతితోడిదే సతికి జీవనముగదా!

వీర—అట్లయిన - కొంచెము తాళుము. ఈప్రతిమా ఖడ్గనారాయ ణునిఁ బూజించి... ...

కళా—నిజమైన ఖడ్గనారాయణుఁడే యింక - నీకౌఁగిటఁ జిక్కనుండ నీ కిప్పుడీ ప్రతిమయేల?

వీర—అట్లయిన కొంచెముసేపు... ... ...

కళా—(నవ్వి) నీకు సంభ్రమమున కాళ్లాడకున్నవి. అమ్మకచెల్లా - ఇప్పుడే యింత సంభ్రమించుదానవి- రేపు ఖడ్గనారాయణు నితో కాపురము చేయునాడు మేము జ్ఞప్తికైనా వత్తుమా! కదలిరమ్మా - నీకు బాలయతి వేషమును సిద్ధముచేసెదను. (బుగ్గలు నులుముచు లాగుకొనిపోవును.)

(భయముతో వెంకన్న ప్ర॥)

వెంక—ఇంక నాకు బ్రతుకుదెరు వేమిట్రా దేవుఁడా! తనమీఁద నేర మ్మోపానని కొండారెడ్డి కత్తిదీసికొని నావెంట బడ్డాఁడు. ఇం దెక్కడనైన దాగుదునా? ఎక్కడదాగినా - బ్రతుక నిస్తాఁడని తోచదు ఈముసలిముండాకొడుక్కు—దుర్మరణమే కలుగనుంది కాబోలును. (ప్రతిమనుచూచి) నాకిప్పుడొక మంచి యుపాయం తోస్తూంది. ఇక్కడ నెవఁడో నిద్ర బోతున్నాఁడు. (పరికించి) భళీ! ఎవడో అనుకున్నాను. ఖడ్గ నారాయణే పండుకున్నాఁడా? నామీఁది పచ్చడ మీయనకు కప్పివెళతాను - కొండారెడ్డివచ్చి - నేనే అనుకొని యితణ్ణి చంపెనా — యిక ముందరికిరాక, వెళ్ళిపోతాఁడు. ఖడ్గనారా యణే యితణ్ణి చంపాలనివస్తే యిద్దఱు పోట్లాడుకొనిచస్తారు.

(పచ్చడముకప్పి దాగియుండును.)

(కొండారెడ్డి ఖడ్గపాణియై ప్ర॥)

[39 వ అనుబంధము]

కొండా—ఓరీ! దురాత్మా! నా బారినుండియూ పారిపోఁబోవు చుంటివి? నీవు పాతాళంబున దూరినను నేడీ కొండారెడ్డి నిన్ను విడుచువాఁడా కాఁడు. (పచ్చడము కప్పఁబడిన ప్రతిమనుఁజూచి) ఓరీ! నీచుడా! వెంకన్నా! చెడత్రాగి యొడలెఱుంగక యిందు నిద్రించుచుంటివఁటరా! – ఇదె– నీ శిరస్సు తఱిగి – మత్క్రోధానలము వాఱ్చుకొందును. (ఖండించి తెచ్చి శిరస్సును పరికించి భయాశ్చర్యముతో) ఎవ్వరి దీ శిరస్సు! పుణ్యాత్ముఁడగు ఖడ్గనారాయణునిదా? హా! పరమేశ్వరా! (మూర్ఛిల్లును.)

వెంక—(ప్ర॥) ఖడ్గనారాయణనే కొండారెడ్డి చంపినాఁడు. ఇంక నావంకకు రాఁడు. రెడ్డినూటవిని కొండారెడ్డిని మట్టుబెట్టెదరు. మారాజుతో యీమాట చెపుతాను.

కొండా—(మూర్ఛదేరి)

[40 వ అనుబంధము]

అకటకటా! ఏమి యీ దారుణము! పుణ్యమూర్తియగు ఖడ్గనారాయణా! మహాఘోరకలుష స్వరూపుఁడగు నాచేతనే వధింప బడితివా! నీతండ్రి పాదములం బడి ప్రార్థించి నా పాపంబు నాపుకొని నీతోడ సఖ్యమునం గూడి యనపోత నాయని వధింప నిన్నగదా సంకల్పించుకొంటిని. పరమేశ్వరుఁ డింతలో నాకీకట్టబడి దుష్ప్రాప్తిఁ గలిగించెనే? ఇంక నీ తండ్రి మొగమునెట్లు చూతును? నాజీవితమున కిఁక పరిణామ దశయేది? ఈ సంగతి వెల్లడియైనచో రెడ్లు నన్ను కాకులు పొడిచిన చందమునఁ బొడిచివేయుదురుగదా! అట్టిహీన మృత్యుదశ నందనేల? ఈఖడ్గముననే యాత్మహత్య గావించు కొనియెద గాక (పొడచుకొనబోయి) కాదు కాదు – అట్లు యిన నా పశ్చాత్తాపము రెడ్లకెట్లు తెలియఁగలదు? నేను

రెడ్లకేమి యుపకృతి సల్పినవాడ నగుదును? కొండారెడ్డి వంశద్రోహియైనది చాలక ఖడ్గనారాయణుని చంపి తాను చచ్చెనను. అపకీర్తి మాత్రమే కలకాలము నిలువగలదు. అట్లేల చేయవలయును? శత్రుఁడగు ననపోతనాయనిఁ జంపి యీ ఖడ్గనారాయణుని శిరస్సునకు తద్రక్తాభిషేకముచేసి పిమ్మట మరణించెదను.

(41 వ అనుబంధము నిష్క్రమించును.)

(తరువాత కళాపూర్ణుఁడు ప్రి)

కళా—ఓహో! ఇప్పు డేదిమార్గము! అపాయమే కల్గినదే! ప్రతిమా శిరస్సును ఖండించి ఖడ్గనారాయణుఁడే యని భ్రమపడి కొండారెడ్డి యనపోతనాయని వధింప నరిగినాఁడు, అనపోత నాయని బంధించి తెచ్చి తన తండ్రియెదుటనుంచినఁ గదా-ఖడ్గ నారాయణున కజ్ఞాతవాసశిక్ష వదలుటయు, యువరాజగుటయు సంభవించును. కొండారెడ్డియే - యనపోతనాయని జంపి నచో - తన ప్రతిజ్ఞా పరిపూర్తి కానందున ఖడ్గనారాయ ణున కెఱఁగించి కొండారెడ్డి ప్రయత్నము నాపునట్లు ప్రోత్స హింతును. (నిష్క్రి)॥

—:o:—

3 వ రంగము

(భిల్లాశ్రమము)

(సన్యాసివేషముఁ దాల్చి కేదారనాథుఁడను పేరుతో ఖడ్గనారాయణుఁడు ప్రవేశము.)

కేదా—(స్వగ) ఈ సమయమున నా కింతకన్న కర్తవ్యమేమున్నది! ♦ ప్రశాంతమైన వేషముతో నీ యాశ్రమమున నేకాంతముగ నున్నను నామనస్సు నిరంతరము - వీరభద్రా మనోహ

రాకార సందర్శనమునకై — యువ్విళులూరుచున్నది గదా!
♦ హా! మనోహారి వీరభద్రా! వీరభద్రా!

గీ. నగమువలె నీవు సంతతోన్నతవె యైన,
ప్రకృతి కోమలవును, దయాభరిత వగుదు*
వెచటనుంటి వేగతిని వచించినావు
మహిం గలవా లేవా నీవు హిమాంశు వదన!

ఊర్మికాకంకణాదులతో శోభిల్లు నీ సరోవర మీ సమీపము నుండినన్నుం బిలుచుచు నీ స్మృతిని నాకుం గల్గించుచున్నది? ఐనను నీ మనోహరరూప మీ సరోవరమునందలి పద్మ కైరవములను జయించుచున్నది. అందు నా కాశ్చర్యమేల? కువలయమును, మోహింపం జేయగల చంద్రునే ఏ ముఖాంబుజము జయించుచుండగా! పద్మకైరవము లెంత! ♦ ఓ నా మనోహారిణీ! వీరభద్రా! ఆనాడు నాపై విరులదండ విసరి నప్పటి కృపా కటాక్షామృతమేకదా - యీ గడియ వఱకును నా జీవనములను నిలువంబెట్టగల యామధమైనది.

గీ. నెలంత! నీ ప్రణయాబ్ధి మున్గినను గాని
యస్మదీయ మనఃపాత్రి కబ్బెనింతె
పంచపాత్రిను వనధిలో ముంచినను వి
శేషజలమునుం దనలో జెందనట్లు
ఆహా! ఏమి ప్రకృతి ప్రతాపము.

---

♦ 33 సంచారిభావము లందును. మొదంటిదగు నిర్వేదము.
* దైన్యము. * వ్యతిరేకాలంకారము. ♦ శంక.
* శ్లేషాస్మృతిమంతా లంకారము.
* కావ్యార్థా పత్యలంకారము.
* అవజ్ఞాలంకారము.
* సంపూర్ణ పద్యార్థముచే నుపమాలంకారము.

గీ. మరుని రేపి శశాంకున కెరసుఁ జూపి
నన్ను తపియింపఁ జేయ సన్నద్ధమయ్యె.

ఓప్రకృతీ!- నీ యీ రెండు ప్రయత్నములును నిరర్థకములే సుమా! ఏమంటివా!

గీ. నాహృదినిఁ గల డాత్మజాంతకుఁ డొకండు
యీశశిని దిట్టినట్టి గణేశుఁ డొకఁడు.

అదేమి చిత్రమో కాని కన్నులు మూసినను తెఱచినను సర్వత్ర - వీరభద్ర మనోహరాకారమే కదా కాన్పించు చున్నది. *

సీ. కమలమా! కంటివే! కమలాయతాక్షిని
గురుతర మధు సరోవరములందు
సారంగి కంటివే! సారంగ నేత్రను
ననవనోత్ఫుల్ల వనంబులందు
కోకిల! కంటివే! కోకిలస్వన నీవు
సరస రసాల కుంజంబులందు
పున్నాగ కంటివే! పున్నాగ - గంధిని
శాంత నీరంధ్ర వృక్షాగ్రమందు

గీ. నిష్కళంక ముఖంబుఁ గాన్పించినంత
చటులమగు నీర్ష్యచేత మా చంద్రవదన
తరుణి నేమైన నీలోన దాఁచినావె!
చల్లగామింట వెల్గునో చందమామ!

హా! వీరభద్రా! వీరభద్రా!! (మూర్ఛిల్లును.)

(వీరభద్రుడు ప్రవేశము)

---

• కావ్యలింగాలంకారము. * విశేషాలంకారము.

వీర—మహాత్మా, కేదారనాథా! వచ్చుచున్నాను. వచ్చుచున్నాను. (చూచి) ఆహా! నాహృదయేశ్వరుడు నాకొఱకెంతగాఁ బరితపించుచున్నాఁడు! నాథా! నేనుండియు నీకు లేనిదాననైతినిగదా! ఇట్టి నేను బ్రతికి యేమి ఫలము! నీ సేవాభాగ్యమునకు నోచుకొనని నాచేతులేఁ కాల్పనా!

సీ. కాల్వలై పారెడు కన్నీరు నా కొఱ
కే గదా విడచుట శ్రీకరాంగ
తను సౌఖ్యమును రోసి ధరణిపై దొరలుట
నా కొఱకే కదా నళినవేత్ర!
బడుగు సన్యాసివై - యడవులఁ బడుట నా
కొఱకేకదా దయాభరిత హృదయ
రాచకొండను శత్రురాజుల వశమాట
నాకొఱకే కదా న్యాయమూర్తి!

గీ. పవలు రాతిరి యను భేద భావమేది
నాకొఱకు గాదె - శోకమానసుఁడ వైతి
యుండియును లేనిదాననై యుంటినీకు
శ్రీకరాకార! రిపుహర! రెడ్డివీర!! *

ఈమదనతాపమెక్కడ? సుకుమారమగు నీతని శరీరమెక్కడ! (స్పృశించి) ఆహా! శరీర మెంత కాగుచున్నది! ఈతఁడు లేచిన వెనుక నా వేషమునుగాంచి యీతఁడు నన్నాదరించునో లేదో కదా!

కేదా—(నిద్రలేచుచు) ఆహా! ఎంత కలగంటిని (వీరభద్రా)? వీరభద్రా!

* సమత ♦ విషమాలంకారము.

వీర—స్వామీ! నేనిందే యున్నాను.

కేదా—ఏమీ! నాకు వీరభద్రాద్రి సందర్శనభాగ్యము కలిగినదా!— (పరికించి విస్మయముతో) మీరెవ్వరు?

వీర—(స్వగ) డెందమా! తొందఱపడకు (ప్రకా) మహాత్మా! నన్ను వీరభద్రుఁడందురు.

కేదా—మీరేల వచ్చితిరి?

వీర—తమ పాదసేవకొఱకు.

కేదా—ఏమి యాచిత్రము! మీరునాపాదసేవ చేయ సంకల్పించుట పరమాద్భుతము. యేలనన!

గీ. పార్వణ శ్చంద్ర చంద్రికా భవ్య తేజ
మోహనంబగు నీ ముఖాంబుజముఁ గన్న
కంతుఁడవొ వసంతుఁడవొ జయంతుఁడవొ య
టంచు నా మది సంశయ మగుచునుండె.

వీర—మహాత్మా! నేనట్టివాఁడను గాను. నేను తమ పాదపరిచర్య నభిలషించి వచ్చిన యొక దీనుఁడను. నన్ను మీశిష్యునిఁగా నంగీకరింప వేడుచున్నాను.

కేదా—నాయనా! సర్వసంగ పరిత్యాగినై నేనీవనమున నొంటరిగ నున్నాను. నాకీ జంఝాటమేల! నీదారి నీవె చూచుకొనుము.

వీర—మహాత్మా! మీ సేవాలాభమునుఁ గోరివచ్చిన నన్నిట్లు నిరాక రింప దయామయులగు మీకు నోరెట్లు వచ్చెను?

సీ. ఉదయందు నిత్యాగ్ని హోత్రాదికంబుల
సమకూర్తు మీ సమక్షంబునందు
అరసి జలావగాహమునకు శుభ్రోద
కముల నందింతు త్రికాలములను

బడలిన తావక పాదార్చనాంచిత
సేవఁజేసి పవిత్రి జీవినగుదు
కట్టెమీరలు వీడు కావిధోవతు లెల్ల
నుదికి—జలములార్చి—పదిలపరతు

గీ. మీకుఁ దీరికయైన. యామినుల యందు
సత్కథల నాలకింతు మీసరసనుండి
తావక మృదుల మంజులాధరముఁనుండి,
వెడలు బోధామృతము విందువిందుగాఁగ!

కేదా—(తనలో) ఔరా! ఏమి యీచిత్తచాంచల్యము! ఈకుమార యోగి వాక్యములచే, నామనస్సు కలఁత నందుటయే కాక, అయస్కాంత సన్నిధానమున నాకర్షింపఁబడు నినుమువలె యీడ్చుచున్నది? ఈతని ముఖమును, కంఠస్వరమును మన్నెన్నడో— స్వల్పమాత్రిముగ, బరిచయమైనట్లు— తోఁచుచున్నది. కారణమేమో— తెలియదు ఐనను_అడిగి తెలిసికొందును. (ప్రకాశముగ) అయ్యా! నేనిదివఱకు — మిమ్మెన్నడైన గనుగొంటినా?

వీర—ఈయాకారమునసున్న నన్ను—తమరుచూచుటకిదియే ప్రథమమని యూహింతును.

కేదా—అట్లయిన, జాహ్నవీతీర తమాలవల్లికలవలె నీలములుగానున్న నీ శిరోజములును; పరిపూర్ణసుధాకరబింబసమానమగు, నీముఖమండలమున ♦ నీయందు నాకు స్త్రీత్వ శంకఁగలిగించుచున్నది. వీరభద్రా! నీవు, నిజముగ, పురుషుఁడవేనా?

వీర—(స్వగతము) ఆహా! నాహృదయేశ్వరుడీత దైన్యమునఁబలుకుచున్నను నేనింతైన చలింపకుండవలసి వచ్చెనుగదా! * ఔరా! కాలమహిమ? జీవితేశ్వరుని సముక్షభాగ్యము

---

♦ స్మృతి, * ప్రౌఢోక్త్యలంకారము, ♦ స్తంభము.

నందియు, నేనీవిధముగా, నింకెన్నినా ళ్లుండవలయునో కదా
♦ ప్రకాశముగ అయ్యా! పరిపూర్ణ దివ్యజ్ఞానముచే శోభి
తమగు- నన్ను స్త్రీయో—పురుషుఁడో యని- శంకించు
సహజమే కదా!

గీ. నిశ్చలంబైన భక్తికి నిఖిలజగతి,
స్త్రీపురుష భేదయోగ సంసిద్ధి లేదు
పురుషుడే స్త్రీయగును; స్త్రీయె పురుషుఁడగును
కాలయోగ బంధనములఁ గట్టువడుచు*

కేదా—ఇదియొక, కప్పదాటుగానున్నది. కుమారా! నీకీ కేశబంధ
మెక్కడిది!

వీర—ఈప్సితార్థ సిద్ధియైన తరువాత— నాయీ కేశబంధమును.
కేదారనాథుని పరముచేయుదునని మొక్కుకొంటిని. స్వామీ
తమశరీరమేలనో— రాత్రికాలమందే— స్వేదకలితం బగు
చున్నది. ♦ నన్నొకింత విసరనిండు. (విసరుచున్నది.)

కేదా—ఆహాహా! ఏమి యీ పారవశ్యము!

గీ. ఇతఁడు నా సన్నిధాన సంగతినిమాని
చనినఁ, బ్రాణంబువాయుదు ననుచుఁ దోఁచె
శీతలంబైన యీతని చేతిసురటి
ప్రేమసందేశమునుఁ దెచ్చురీతిఁ దోఁచె.

గీ. ఏమొకాని, యీబాలు లోలేక్షణములు,
చిరము మా వీరభద్ర సంస్మృతిని సేయు
వీరభద్రియె యగునో- యీవీరభద్రుఁ
డకటకట! వాయుటెటు సంశయంబునాకు.

(కన్నులు మూయును.)

---

♦ ఔత్సుక్యము. *అవహిత్థ. స్వేదము.

వీర—మహాత్మా! ఏల కన్నులు మూసితిరి?

కేదా—(కన్నులు మూసియే) వీరభద్రా! వీరభద్రా! నీవు కపట వేషము నభినయించుచు నన్ను మోసగించుచుంటివా! ఆ యువ లగ్నములగు కాషాయచేలములం దీసివేయుము. నన్నుఁగాంచి నవ్వకు—నవ్వకు—

వీర—మహాత్మా! కన్నులువిప్పి చూడుఁడు ఈయున్మాదమేలఁ

కేదా—వీరభద్రా! ఇంకను. నీయాకృతి మానవా!

వీర—ఇదియే నాయాకృతి—వేఱేమున్నది?

కేదా—కాదు—నేనెఱుఁగుదును: ఇటువిను.

సీ. సంపెంగనూనె, వాసనలు క్రీజెడ మాని
నిబిడ జటావళి నీకుఁ దగునె?
హేమకంకణ భూషణామూల్యతతి మాని,
రుదురాకపేరు లొప్పిదము లగునె?
చీనిచీనాంబర శృంగారములు మాని
కాషాయ చేలంబుఁ గట్టనగునె?
ఐహిక సౌఖ్యంబు లన్నిఁటి. బాసి, యీ
గతి యోగినీవృత్తిఁ గాంచనగునె?

గీ. లోకమోహాన రూపంబు లోనదాచి,
పురుషరూపంబు నీవిటు బూనదగునె?
మరణ మందఁగనున్న, నీ చరణదాసు
విధముఁగాంచుచు, నిట్టు లుపేక్షదగునె?

వీర—స్వామీ! ఏమియిది! నన్ను తమరు వేరుగా భావించినట్లు తోఁచుచున్నది. తమకట్టి సంశయమున్న యెడల నేనీ స్థలమును విడిచిపోవుదును. (పోఁబోవును.)

కేదా—(వారించి) ఆఁ? ఆఁ!! బాలయతీ! బాలయతీ! నన్ను వదలకుము! నన్ను వదలకు! నీవు నన్ను వదలితివేని నేనీ ప్రపంచమునే వదలెదను.

వీర—స్వామీ! అట్లయిన నాయందు సంశయము మానెదరా!

కేదా—నీయందు నాకు సంశయ మెక్కడిది?

వీర—మఱి యిట్టిమాట లేల!

కేదా—(నవ్వి) వెఱ్ఱివాఁడా! ఇదినిజమని భావించితివా! నేనిప్పుడు క్రొత్తగావ్రాయుచున్న "వీరభద్రవిజయ"మను ప్రబంధము నందలి శృంగారాశ్వాసమును కొంత చదివితిని.

వీర—(నవ్వి) అటులనా! స్వామీ! మహాత్ములు గంభీర హృదయులు గదా! (కూర్చుండును.)

(కళాపూర్ణుఁడు ప్రవేశము.)

కళా—స్వామీ కేదారనాథా! మహాపాయము సంభవించినది.

కేదా—ఏమది! మీరెవ్వరు?

కళా— నేనెవ్వఁడనో మీరెఱుంగ నక్కఱలేదు. కొండారెడ్డి యనపోతనాయని వధింప నరుగుచున్నాఁడు. ఆతఁడాతని వధియించెనేని ఖడ్గనారాయణుని ప్రతిజ్ఞ నెరవేరఁజాలదు.

కేదా—ఔను. మా కిప్పుడిది క్లిష్టసమయమే! అట్లయిన వీరభద్రా నేను రాచకొండకరిగి వచ్చెదను.

వీర—స్వామీ! నేను తమ ఛాయనే గదా?

కళా—నేనును మీ యిరువురి ననుసరింతును.

కేదా—సెబాస్ మాకిప్పుడు చక్కని సహాయము లభించినది. ఓరీ! కొండారెడ్డీ మా సర్వకార్యములకును నీవే యంతరా

య మగుచున్నావు గదరా! నిలువుము—పాపీ! ఇప్పు డెందు బోయెదవు? నిన్నువధింపక మాన.

(అందరు నిష్క్రమించుచును.)

## 4 వ రంగము

[అనపోతనాయని క్రీడోద్యానము]

[కొందరు వేశ్యలు, త్రాగుచు అనపోతనాయఁడును, వెంకన్నయు ప్రవేశము]

వేశ్యలు—(నృత్యముచేయుచు పాడుదురు)

42 వ పాట సారంగ—త్రితాళ్

మధు । సేవాధికమా । భావానందము । లేదీ ధాత్రిలోనన్ ॥మ॥
సేవింప । ననుభవింప॥ చింత లణగించుగా ।
మదిసం । తసమే ర్పడుగా ।
ఇంతకన్న । నీ జగాన । సంతసప్ర । దంబు లేదుగా ॥మ॥

అన—వెంకన్నా! ఏదీ! ఏదీ! ఒక్కసారి—

వెంక—(సారాయి నిచ్చి) జల్లనితల్లి—సారాయితల్లి—మహారాజా! దీన్న గుటుక్కున గొంతుక దిగజార్చండి.

అన—ఔనురా! వెంకన్నా! నువ్వు—సత్తెమైనమాట చెప్పావురా? విచారాల కన్నిటికీ ఇది ఒక్కటే దివ్యమైన మందు.

(సారాయిబుడ్డి జేతఁబట్టుకొని ఆడుచు)

43 వ అనుబంధము)

(రాణి ఖడ్గము ధరించి ప్రవేశించి)

రాణి—ఏమి? మీ మధుపాన గోష్ఠి? ఏమి యానంద తాండవము? ఏమి యీ పిశాచ నృత్యములు? ......ఓ వేశ్యలారా! నేనిది

వరలో నొకటి రెండు సారులు శాసించినను మీకు జ్ఞానము గలుగ లేదుగదా! ఇంకొకమారీ మధుపాన నృత్యములకు వచ్చితిరేని మీ రక్తమును కనులఁ జూతును. పోండు.

వెంక—వారిని మహారాజుగారు ఖుషీకోసరము పిలిపించుకొన్నారు.– పంపకండి–పంపకండి–వసేమనోహరీ–కొంచెము తాగుతావా?

రాణి—ఛీ! ముసలి పీనుగా! ఏడేండ్లనాటి శనివలె నీవిందే యుంటివా! పూజ్యుఁడగు మహారాజు నీమూలముననే గదా చెడిపోయినది! వృద్ధ మర్కటమా! నీకు వచ్చిన యేండ్లెవరికి వచ్చినవి? నీవు త్రాగునది చాలక మహారాజునకు సయితము, త్రాగుడు నేర్పి ఈ ముండల నందరిని తార్చుచుంటివా? ఓసీ! వేశ్యాభూతములారా! పోయెదరా! మిమ్ము చంపవలయునా?

(వేశ్యలు భయపడుచు నిష్క్రమింతురు)

వెంక— మహారాజా! మహారాజా! లెండి! లెండి! రాణిగారు వచ్చారు.

అన—(అప॥ వెంకన్న నోరుమూసి) కుక్కిన పేనులా గుండరా వెధవా! అల్లరిచేసిన రాణి చంపగలదు. చాల చెడ్డది.

వెంక—(రహస్యముగా) ధైర్యం కోసం యింకొక బుడ్డి తెచ్చి యియ్యనా?

అన—(రహస్యముగా) ఛీ! నోరుముయ్యి. ఇప్పుడు మాట్లాడకు. రాణి చేతులో ప్రాణములు బాసెదవు.

రాణి—రాజేంద్రా! ఏమి యీ లజ్జా హీనత! నిన్ను లోకమంతయు నెట్లాడిపోసికొనుచున్నారో – పండువంటి వంశ మెట్లపకీర్తి పాలైనదో గ్రహింప లేకుంటివా!

[44 వ అనుబంధము]

అన—(కైపుచే తూలుచు) రాణి! నన్ను అల్లరి పెయ్యకు - ఇదిగో కొండారెడ్డి డెగ్గరికి నువ్వు వెళ్ళి పో—సీటో నాకు పనిలేదు. అలే! ఎంకన్నా – ఎంకన్న - ఎథవ షచ్చావా! బుడ్డీటే - బోగంవాళ్ళని పిలు - ఈ రాణిని షూస్తే నావొల్లు షిర షిర.

వెంక—మహారాజా! ఇదిగో బుడి్డి. తాగండి (యిచ్చును)

అన—(తాగును)

రాణి—(లాగికొని పారవేసి) మధురస పిశాచ మావహించి యొడలు తెలియక పేలకు. కొండారెడ్డి యెవ్వడు? వానిదగ్గరకు నేనేల పోవలయును? భూపాలుడవై యుండి నీ సతినగు నన్నిట్లను టకు లజ్జింపవా? ఓ మందబుద్ధీ!

చ. పొలుపగు రాట్కులంబు నినుబోలు నభాగ్యుల మున్నుగాంచెనే?
తులువ! కులంపుకీర్తి నఘుతోయధి మున్గఁగ దోసినావు నీ
ఖలచరితంబు విన్న భువి కాంతులు నవ్వరె? రాచవారిపైఁ
గల జనగౌరవం బిటుల గంగను గల్పితివేమి బాలిశా!

అన—పో-పో- రాచవారూ—పౌరుషం—నాకు తెలియదు వెంక న్నా—ఎథవ—షచ్చావా! (పడిపోవును)

రాణి—వెంకన్న నీ కింకొక బుడ్డి నిచ్చినా—చచ్చుటయే నిజము.

వెంక—(తూలుచు) ముసిలోణ్ణి సంపుటావా! ఏదీ! షంపు షంపవ వమ్మా—షంపు—

రాణి—తులువా! పేలకు—ఏది ఇంకొకసారి రాజునకు సారాయి నిమ్మా—చంపెదనో—లేదో—

వెంక——ఇష్టాను—ఇష్టాను—నీకుండుకూ – (బుడ్డితీసుకొని తూలుచుం బోయి) రాజుగారూ – రాజుగారూ బ్రాబ్రూ – బ్రాబ్రూ అప్పుడే పోలిపోయావంట్రియ్యా! పట్టుమని పదిగుక్కలయినా పీల్చలేదూ! (రాజు నోటం బోయుచు ఆడిపాడును.)

(45 వ అనుబంధము)

రాణి——(వెంకన్నను పొడిచి చంపుచున్నది.) చావు—వృద్ధపిశాచమా! చావు—పెద్దపులులతోనా పరిహాసములు! ఇప్పుడు పరేతలోక నాయకుండగు యమధర్మరాజు నెదుట—తాగి తాండవింపుము దుష్టుండా!

(తెరలో కొండారెడ్డి)

ఓహో! రాజపరివారములారా! అన్యాయముగా రాజుచేం బరాభవింపంబడి యిప్పుడు చంపి పగందీర్చుకొన వచ్చిన నేను కొండారెడ్డిని; మీరాజుతో నీమాట చెప్పుడు.

రాణి——ఆహా! ఏమి యీ దారుణము! భీకరాకారముతో నెవ్వరి శిరస్సునో ఖండించుకొని కొండారెడ్డి యీ వంకకు వచ్చుచున్నాండు నేనేమి చేయుదును...లోపలకుం బోవుదునా? ఇందే యుందునా?......ఏమి నాభ్రాంతి? పిడుగునకు వారశూల యొకటియా! ఇంతవఱకు వచ్చినప్పుడు – నాకింక ఘోషా పద్ధతులేల? ఇతండేమిసేయునో చూచియే కదలెదం గాక!

(కొండారెడ్డి ప్రవేశము.)

కొండా——ఓరీ! దుష్టాత్మా! అనపోతా! ఇప్పుడు నా కరపంకరంబునం బడితివిరా! ఇంకెందు బోవంగలవు? (రాజును గట్టిగం గాగలించుకొని) ఓహో! జనులారా! మీ రాజేంద్రుం డనుభవించుచున్న మిత్రద్రోహ ఫలమును నేత్రోత్సవముగాం జూడుండు, నా బాహుయుగళ పరిబధంబులన వీని నిఱికించి యెముకలు చూర్ణమగునట్లొనర్చి—పిదప చిత్రవధ గావింతును.

చ. ఎవరు చళుక్యభూవర మహీరుహముఁ దహియించె నగ్నియై
యెవఁ డపరాధదూరు నను నేడ్చెరఁ బట్టి పరాభవించె నా
యువమతి నాభుజాయుగళ మందు నిబంధితుఁడై నవాఁ డహో!
సవసవలేల? రండు ననుఁ జంపఁగఁ జాలిన శూరు లున్నచో.

రాణి—కొండారెడ్డి! చాలునులే — నీ యుపాలంభములు! నీవు శూరుఁడవైనచో తాగిపడియున్నవానిని బంధించి చంపుట పౌరుషముగాదు. అతనిచేతి కొక కత్తినిచ్చి సమయుద్ధము నకుఁ బిలువుము— అట్టి విజయము నీకు ఘనమైనది; గాని యిది కాదు.

కొండా—(అనపోతనాయని వదలి) మహారాజ్ఞీ— నీయాజ్ఞాప్రకారమే చేయుదును— ఓరీ! అనపోతా! రమ్ము—నాతోఁ బోరరమ్ము

అన—(కొండారెడ్డినిఁ జూచి భయపడుచు) హా! చచ్చితి— చచ్చితి— కొండారెడ్డి నన్ను చంపుటకే వచ్చినాఁడు. ఓరీ విశ్వాస ఘాతకుఁడా! నిన్ను పోషించిన రాజునుఁ జంపుట న్యాయ మేనా?

కొండా—గీ. రాణికిని, నాకుఁ గలదని అంకుఁగూర్చి
ననుఁ బరిభవించు టేరీతి న్యాయమయ్యె
నట్టి నిన్ను భీషణ సమగ్రాగ్రహమునఁ
జంపుటయు నట్టి న్యాయమే! చదువులేల.

రమ్ము— శూరుఁడ వేని ఖడ్గాఖడ్గినిఁ బోర రమ్ము.

అన—వెంకన్నా! ఇప్పుడు పౌరుషమునకు సమయము వచ్చినది రా! ఏదీ ఒక్క బుడ్డి!

రాణి—(కోపముతో) ఛీ! ఏమి నీ పశుబుద్ధి! లజ్జావిసర్జనము చేసి వదరఁ జొచ్చితివా? ఇప్పుడు నీకు పౌరుషమునకై కావలసినది

సారాయియా! ఓ శనేశ్వరావతారమా! ఇదిగో కరవాలము! నీ తండ్రి తాతల పేర్లు నిలువఁ బెట్టిన దీనిని ధరించి వీరుఁడవై పరాకాసింపుము. ఇప్పుడు; నీవు యుద్ధము చేయకుంటివా— కొండా రెడ్డిమాట యేమోకాని నేనే నిన్ను చంపెదను. చూఁడు.

అన—(వణకుచు) దేవీ! రక్షించు—రక్షించు— నన్ను కొండారెడ్డిచేఁ జంపించెదవా!

రాణి—ఏల చావవలెను? నీవే గెలువఁ గలవేమో!

అన—కల్ల— కల్ల— నేను గెలుచు టెక్కడిది? కొండారెడ్డి యెవరినో చంపి శిరస్సును సయితము తెచ్చినాడు. ఇట్టివాఁడు నన్ను సంహరించును గాని క్షమించునా?—

కొండా—ఓరీ! అనపోతా! చూఁడు మిదె ఖడ్గనారాయణుని శిరస్సు- నీ రక్తముచే దీని నభిషేకింప వచ్చితిని.

అన—(భీతిల్లి) అబ్బా ఎంత భయంకరము— ఖడ్గనారాయణుఁడే కొండారెడ్డిచే వధింపఁబడెనా! ఇఁక నాలెక్కయేమి? నేను బ్రదుకను— రాణీ! వెంకన్నతోఁ జెప్పుము— ఇప్పుడు, నా శరీరమున సత్తువ యేమియును లేదు. ఒక బుడ్డెడు— సారాయి యయిన కంఠము జాఱినగాని, వీనితో పోరాడలేను.

రాణి—తిరిగి సారాయిమాట నెత్తుచుంటివా! నీ కీ పిరికితనము సారాయివలనఁగాదా కలిగినది) పాపాత్ముడగు వెంకన్న యింకను జీవించియుండె ననుకొంటివా? నాఁడు నాకత్తి కిది వఱకే యాహారమైనాడు! ఇదిగో వాని శవము! మారుమాటా డితివా నీగతియు నంతే!

కొండా—సెబాస్! వీరాఁగనామణి సెబాస్! క్షత్రియకులమున కంతటికిని సత్కీర్తిని సంపాదించితివి!

అన — రాణీ! రాణీ!! - మన వెంకన్నను నీవే చంపితివా! ఇంతకు తెగించినదానవు నన్నును చంపగలవు. నా కెట్లును అటు కొండారెడ్డిచేతనో ఇటు నీచేతనో చావు తప్పదు - హీనముగ ఆఁడుదాని జేతిలో అందు—గళమునందు సూత్రముఁ గట్టిన యాఁడుదానిచేతిలో - చావనేల? కొండారెడ్డితోడనే పోరాడెదను - ఎవటికో యొకటికి జయము గల్గును—రారా - కొండారెడ్డీ! రా - ఇదిగో నాకత్తి.

కొండా—రమ్ము—

(కొండారెడ్డియు, అనపోతనాయుఁడును రణము చేయుదురు కొండారెడ్డి, యనపోతనాయని గొంతు కోయఁబోఁగా కేదారనాధ వీరభద్ర, కళాపూర్ణులు ప్రవే॥)

ఖడ్గ—ఓరీ! కొండారెడ్డీ! నీగర్భశత్రుండనగు నేను జీవించియుండఁగా నీ వెట్లనపోతనాయని చంపగలవు? (ఎదురొ్కనును.)

కొండా—(ఖడ్గనారాయణునిఁ జూచి, భ్రాంతుఁడై కత్తిక్రింద జాఅవిడిచి)
ఇదియేమి? పిశాచాకారము?

ఖడ్గ—(తన్ను చూచుకొని) వీరభద్రా! నా యాకృతి విపరీతముగ నున్నదా యేమి? కొండారెడ్డి యిట్లనుచున్నాఁడు!

వీర—ఆఁ! ఘూర్ణాయమానమై - యపర నారసింహావతారమువలె నున్నది!

కొండా—ఆఁ! నారసింహావతారమా! కాదు - ఖడ్గనారాయణుఁడు పిశాచమై - నన్ను - జాపవచ్చినాడు. ఓ ఖడ్గనారాయణుని మూర్తీభవించిన యాత్మశక్తీ నీకు నమస్కారము! నేను - వెంకన్నయని భ్రమించి నీతలగోసి తెచ్చితిని. నన్ను క్షమింపుము.

ఖడ్గ——ఓహో! తెలిసినది! తెలిసినది. కొండారెడ్డి యున్మత్తుడై నాడు. ఏహేతువుచేతనో యీతనికి సన్నిపాత మద్యమున పిశాచభ్రాంతి గల్గినది. ఓరీ! కులద్రోహీ! నీవున్మత్తుడవైన సరియే - మఱియేమైనను సరియే - నిన్ను జంపకమానను. రమ్ము - నాతో పోరరమ్ము - నీ కభ్యుదయకాల మంత రించినది. నాకు తరుణము.

కొండా——కాదుండుము. పిశాచివైన నీవిట్లనుట సహజమే. ఆశ్చ ర్యము లేదు. నీపాదములు వెనుకవైపున కున్నవో ముందు వైపున కున్నవో చూడనిమ్ము, (వెనుకముందులు పరికించును)

ఖడ్గ——ఛీ! దురాలాపీ! నన్ను మఱపించి - ఏమరుపాటున బ్రతికిపో జూచుచుంటివా? నీవెన్ని దొంగవేషములు వేసినను వదలు వాడనుగాను; నిలువుము.

కొండా——(దగ్గఱకు వచ్చి రహస్యముగ) ఖడ్గనారాయణా! సరే నీవు నన్నేమన్నను నేనిప్పుడు నీకు మిత్రుడనే కాని శత్రు డనుగాను. ఐనను - నాకొక సందేహము బాధించుచున్నది? తీర్చెదవా!

ఖడ్గ——నీ సర్వసందేహనివారణము చేయుటకేకదా - వచ్చితిని!

కొండా—నీకీ యనపోతనాయుడు గర్భశత్రువుగదా! అట్టివానిని నేను చంపవచ్చుచుండగా - నీవేల నన్నాటంక పఱచెదవు?

ఖడ్గ——అది యంతయు నీకేల? రణము జేయుదువా? శరణము చేయుదువా?

కొండా——నీకు పిశాచమైనందున మనుష్యులకన్న నధిక క్రోధ ముండదగినదిగదా - రమ్ము మనమిద్దఱమును కలసి వీనిని బంధింతము.

ఖడ్గ—ఛీ! ఇక శాంతించిన లాభములేదు. క్రమముగా నీ యున్మాదము

వ్యతిరేకించుచున్నది. రమ్ము - బలవంతముగ నిన్ను రణము నకు చేరేపక తప్పదు. (కత్తి దిప్పుచు పైకొనుచున్నాడు)

కొండా__ఆ — ఆ— శాంతింపవా? శాంతింపవా?

ఖడ్గ__ఇక శాంతిలేదు — శాంతిలేదు; రమ్ము.

కొండా__ఓరీ! ఎంత చెప్పినను వినవుగా! అట్లయిన-నీ పిశాచాకృతిని గూడ భూమిపై లేకుండ జేసెదను రమ్ము.

(ఇద్దఱు పోరుదురు. కొండారెడ్డి ఖడ్గనారాయణుని చంప బోగా - వీరభద్రుడు వెనుకనుండి కొండారెడ్డి కత్తిని లాగి వేయును. కొండారెడ్డి పారిపోవును.)

అన — (ఖడ్గనారాయణుని పాదములపై బడి) ఖడ్గనారాయణా! నేను నీయందపరాధముం జేసినను నీవునన్ను రక్షించితివి. నీ సౌజన్యము స్తుతిపాత్రమైనది. నన్ను క్షమింపుము.

ఖడ్గ - ఛీ! పాపాత్ముడా లెమ్ము: నేను నీయందలి దయచే రక్షింప లేదు — ఇప్పుడు వధింపక మానను రమ్ము.

గీ. నిన్ను బంధించి నాతండ్రి సన్నిధాన
మందు, నిలిపెదనని సభయందు ప్రతిన
సేయుటను కొండరెడ్డి నిన్ జెనకకుండ
గాచిన నిన్ను; దయచేత గాదుసుమ్ము.

కొండారెడ్డిచే నీమరణంబు తప్పినను - నాచే దప్పదురమ్ము—

కొండా - (చాటున దాగియుండి విని) భళీ ఖడ్గనారాయణా! నీహృదయము నింతదనుక గ్రహింపలేక పోయితిని.

అన__ఖడ్గ__నారాయణా! నే నిప్పు డసహాయుండను. నన్ను చంపిన నీ కేమియును లాభములేదు. కీర్తియును లేదు. న్యాయో

నేల శాత్రవము! క్షమింపుమంటినే! కాళ్ళఁ బడితినే! దయ రాదా?

ఖడ్గ—అందులకే నీ ప్రాణములను నేను తీయను.

గీ. జనకునకు నిన్నొసంగి యజ్ఞాతవాస
దీక్ష వాపుకొనఁగ నెంచితివి దురాత్మ!
నావలన నీకు హాని లే దేవిధమున
చంపినను మానినను నాదు జనకుడొకడె!

అన—అయ్యయ్యో! అట్లని నన్ను బలవంతముగఁ గట్టుకొనిపోయి యనవేమారెడ్డికడ నుంచెదవా! అతఁడు నాకు శాత్రవుఁడే! ఈ స్థితిలో నే నాతని దగ్గర దీనుడనై బంధితుడనై నిలువఁ బడవలెనా?

ఖడ్గ—వీరభద్రా! కళాపూర్ణా! ఇకఁ వీడు పోరాడుట కశక్తుఁడు—బంధింపుడు. మనము— వీనిఁ బట్టుకొని పోవుదము. వీరభద్ర, కళాపూర్ణలు రాజును బంధింపబోవుదురు.)

రాణి—(అడ్డము వచ్చి) ఖడ్గనారాయణా! నాచేత నింకను ఖడ్గము గలదు. నన్ను జంపి నా నాథుని గొనిపొమ్ము.

ఖడ్గ—అమ్మా! పౌరుషమగు క్షత్రియుని గర్భమునఁ బుట్టిన నీ విట్లనుట తగినదే. కాని స్త్రీహత్య మాకు బొత్తిగా కూడనిది. కావున నీవు రాణివాసమున కరుగుము.

రాణి—నాతో నిక విశేషముగాఁ ప్రస్తావింపకుము. మగవాడవేని రమ్ము. నావలె గాజులు తొడిగించుకొంటివా — చేతగాదని నా పతిని నాకిమ్ము.

ఖడ్గ—అట్లయిన నీకును బంధనము తప్పదు. రమ్ము.
(పోరాడగా రాణి పారిపోవును — అనపోతనాథుని బంధింతురు)

కొండా—(తటాలున వచ్చి) ఖడ్గనారాయణుని పాదములఁ బడి) మహాత్మా! ఖడ్గనారాయణా! క్షమింపుము. ఎరుగక నిన్నేమో యంటిని.

ఖడ్గ—కొండారెడ్డీ! లెమ్ము. నీ హృదయము నాకు తెలిసెను. కాని విధిలేక నీతో పోరాడితిని. ఇంక మన మన్నదమ్ములవలె నుందము. నా వంశపువాడవైన నీవు తాత్కాలికముగ వారి వారిం గొలిచి కొన్నినాళ్ళు శాత్రవంబు నెరపినను, నేటికి వంశ మర్యాద నిలిపితివి. రమ్ము - నన్నాలింగనము జేసికొనుము.

కొండా—మహాత్మా! నీవు నన్ను క్షమించితి ననిన గాని నేను నీ పాదములు విడువను.

ఖడ్గ—పరాత్పరుఁడు నీ పాపములను క్షమించెను. అంతర్వాణి యట్లు మనల నాశీర్వదించుచున్నది. మన కిఁక విజయమే సిద్ధము లెమ్ము.

కొండా—ఖడ్గనారాయణా ధన్యాత్ముఁడ నైతిని.

ఖడ్గ—శూరాగ్రేసరా! నీవే మా పక్షమునఁ దొలుత నుండియున్నచో - మాకీ కష్టము లేకుండును గదా!

కొండా—ఖడ్గనారాయణా! నీవు నిజముగ ఖడ్గనారాయణుఁడవేనా? అతని పిశాచ వ్యక్తివి కావుగదా!

ఖడ్గ—నీ విట్లేల నున్మత్తుఁడ వైతివో - నాకు విస్మయముగ నున్నది.

కొండా—నేను నిన్ను చంపితిని గావున -

ఖడ్గ—నన్నెప్పుడు చంపితివి?

కొండా—ఇదిగో నీ శిరస్సు - (చూపును)

కళా—కొండారెడ్డిగా రిప్పుడు పూర్తిగా వంచింపబడిరి.

కొండా__ఎందుచేత?

కళా—ఇది వీరభద్రి నిర్మించిన ఖడ్గనారాయణుని ప్రతిమా శిరస్సు గాని, నిజమైనది కాదు.

కొండా—(పరికించి) ఆహా! ఎంత ప్రకృతి సిద్ధముగ నున్నది? దీనిఁ జూచి నేను వెకిలినైతిని. అట్లయిన నీ యశుభచిహ్నమి కేల? పారవేయనా?

కళా__అనుభవ మేమి? దీనివలన ఖడ్గనారాయణుని పీడ తొలఁగెను.

ఖడ్గ—సోదరా! దీనిని పారవేయవలదు. దీనితో నింకనుపనియున్నది. మన వెంటనే యుండనిమ్ము.

కొండా—సోదరా! ఇంక రెడ్డి విజయ పతాకము నెత్తుకొని ధరణికోటలో జరుగుచున్న యుద్ధమునకు బోవుదము,

ఖడ్గ__ధరణికోటలో యుద్ధము జరుగుచున్నదా?

కొండా__ఔను. నీ తండ్రి నీపై బెంగచే వ్యాధిశయ్యపై నున్నాడు. అనపోతని తమ్ముఁడగు మాధవనాయఁడు యుద్ధము చేయుచున్నాడు.

ఖడ్గ__అట్లయిన ఆలసింపఁ దగదు రమ్ము.

అందరు--(పతాకముల నెత్తుకొని) జయ్! రెడ్డి సామ్రాజ్యలక్ష్మికీ జయ్ — (నిష్క్రమింతురు)

షష్ఠాంకము సంపూర్ణము.

—o—

# ధరణికోట



—♦ రెడ్డివీరుల సంగ్రామకథ ♦—

## సప్తమాంకము

### 1 వ రంగము

ధరణికోటలోని రాజమందిరము.

(వ్యాధిశయ్యపై - అనవేమారెడ్డి॥ ప్రక్కన ఎఱ్ఱాప్రెగ్గడ॥

( 46 వ అనుబంధము )

అ-వే.—(పరుండును)

ఎఱ్ఱా—అయ్యయ్యో! ఎంతప్రారబ్ధము! ఘోరమైన సంగ్రామమావల జఱుగుచుండుట యేమి? శత్రువిజయ సమర్థుండగు కుమార వీరుడు దేశత్యాగియైపోవుట యేమి? ఈ మహారా జిట్లుండుట యేమి? రెడ్డిరాజుల కిక పరాజయమే కలుగనున్నదా! ఎట్టి సామ్రాజ్యమున కెంతలో నిట్టిపాటు గలిగెను.

అ-వే.—(కలువరించుచు) నాయనా! నాఖడ్గనారాయణా! నాఖడ్గ నారాయణా!! నన్ను వదలి యెక్కడికిఁ బోయెదవు? తండ్రినే! నీతండ్రినే!! నాయనా!

ఎఱ్ఱా—అదిగో మరల కలువరించు చున్నాఁడు, రాజేంద్రా! ఏమి యీ కలువరింతలు.

అ-వే.—(లేచి) ఎవఱు మీరు? నాకుమారు నెత్తుకొని పోవచ్చిన దుష్టచిత్తులా? తెండు—తెండు—నా కుమారునిఁ దెచ్చి నాకిండు.

ఎత్రా — రాజేంద్రా! నేను ఎత్రాప్రగ్గడను, నన్ను శత్రునిగా నేల భావించెదవు? నీకుమారుఁడు సజీవిఁడైయుండును. ఎన్నిటికైన దర్శింపఁగలవు. దుఃఖింపకుము.

అ-వే — నాతండ్రి ఎత్రాప్రగ్గడా! ఇట్లు నాకుఁ బ్రియవాక్యములు పలికిన నీకు గనఁకాభిషేక మగుగాక. నా కుమారుఁ డెక్కడ నున్నాఁడు? ఏదియో వార్త తెలిసినఁగాని మీరిట్లాడరు. నాకు వాని యునికి నెఱిఁగింపుఁడు. ఈ ముసలి భుజములపై నెత్తుకొని లాలించెదను.

ఎత్రా — నాకు తెలియదు; కాని, శీఘ్రకాలమున మనకన్నులఁ బడునను నాశ గల్గుచున్నది.

అ-వే — ఛీ! ఛీ! ఎవ్వరినినమ్మిన నింతేకదా! ఇంతేకదా నాబ్రదుకు? ...ఔను- కాక వేఱుగానగునా? స్వల్పాపరాధమును ఘన ముగాఁ బరిగణించి నా కుమారుని సకలసద్గుణ లక్ష్మీ తాకారుని పరాభవించి పంపితినే ఎక్కడ నున్నాఁడో! ఏయవస్థల ననుభవించుచున్నాఁడో! నా కింతైనఁ దెలియదయ్యో. ఎత్రా ప్రగ్గడా! నేను మరణించులోపల నాకుమారునిఁ జూడఁగలనా?

ఎత్రా — అయ్యయ్యో! ఎంత బెంగటిల్లుచుంటిరి: రాజేంద్రా! ధర్మ స్వరూపుఁడవగు నీకు పరమేశ్వరుఁడు కష్టమును గలిగింపఁడు. నామాటనమ్ము.

అ-వే — కుమారా! కుమారా!

సీ. కఠినాత్ముఁడైన నా కన్నతండ్రి కతానఁ
జెడితి నిట్లని మృతిఁ జెందినావొ-
అడవులలోన గుహాంతరంబుల నన్ను
శపియింపఁ జేతువో జనకునీవు

లలి_రెడ్డిసామ్రాజ్య లక్ష్మిసమాశ్లేష
వరసౌఖ్యగరిమ మై మఱచినావొ
బంధువర్గముల లోపల దలనెత్తలే
కే గహనములలో దాగినావొ-

గీ. పుత్రవాత్సల్యహీనుడౌ శాత్రవుండ
నైన ననుఁ గాంతువో లేదొ! తనయ నీవు
తలకొఱవి నా కొసంగఁగాఁ దగిన నీదు
కరములను నేను బూదిగాఁ గలనొ లేనొ!

అ-వే—ఎఱ్ఱాప్రగడా ఏ మాధ్వని?

ఎఱ్ఱా—మహారాజా! మహాసంకుల సంగ్రామము ప్రవర్తిల్లు.

అ-వే—నేడీ యర్ధరాత్రముననే, యుద్ధము జరుగుచున్నదా!

ఎఱ్ఱా—ఔను: మహారాజా! ఈయుద్ధమింకొక జాముజఱిగినచో దుదకుఁ బరాజయమే సిద్ధమని. సైనికులు తలంచుచున్నారు.

అ-వే—అయ్యయో! ఇప్పుడు నాకుమారుఁడున్నచో నీ శాత్రవులను. సదమదించు శక్తిగలవాఁడగును గదా!... ...ఓ రెడ్డి రాజ్య లక్ష్మి! నీకుఁ జేతులారా వైధవ్యమును సమకూర్పు నీ దురాత్ముఁడు, సంసిద్ధుఁ డైనాఁడు.

మ. జననీ రెడ్డిజయేందిరా! మిగుల, దుష్టాత్ముండనౌ నేను నా
తనయుం గ్రూరనిశాతవాక్యముల, సందగ్ధాశయుం జేసి దు
ర్జనులౌ శత్రులకప్పగించి, భవదుగ్ర క్రోధ దావాగ్ని కిం
ధనమైపోవఁగ నుంటి, కావ్పవె ననుం గారుణ్య చిత్తంబునన్.

(తె ర లో)



ఓహో! రెడ్డివీరులారా! వెలువకుఁడు! వెలువకుఁడు — భిల్ల సేనలతోఁ గృష్ణరాజు మీకు సహాయుఁ డయ్యె — కృష్ణ రాజుతో వచ్చిన — భయంకర భిల్లవీరుండెవ్వఁడో శత్రు వుల నరఁటికంబముల వలె నఱకుచున్నాఁడు. చెదరిపోయిన మీధైర్యమును సమకూర్చుకొనుఁడు——

అన——ఎఱ్ఱాప్రగ్గడా! ఇది మన రామాప్రగ్గడ ప్రబోధముగా నున్నది. ఎవ్వడో భిల్లవీరుఁడు దారుణ ప్రవిదారుణము సలుపుచున్నాడఁట? ఈ గవాక్షమార్గమునుండి రణచాతుర్య ముం బరికింతము రమ్ము——

ఎఱ్ఱా——మహారాజా నా భుజాగ్రమునాని రండు బలహీనతచే సోలి పోవఁగలరు.

(యథాప్రకారముగా, గవాక్షసమీపమున నిలుతురు)

అన——ఎఱ్ఱాప్రగ్గడా! అటు చూఁడు——

సీ. అగ్నిగోళంబుల ననుకరించెడు చల,
దారక్త విస్ఫార నేత్రములవాఁడు
బహువిధా రిందమ ప్రఖ్యాత పరశు——సం
కలిత దివ్యాంస భాగంబువాఁడు
బర్హి బర్హముతోడ, పాలపూసలతోడ
డంబైన శిఖరి పింఛంబువాఁడు
అరిభీకరంబైన అసిచాలనముచేత
మించిన భీతి గల్పించువాఁడు

గీ. శ్యామలంబైన దివ్య తేజంబువాఁడు
శత్రు రక్తాభిషేక యశంబువాఁడు
అహిత శిరకందుక క్రీడ లాడువాఁడు
భిల్లవీరుఁడు కనులకు విందు జేసె——

(18)

ఎఱ్ఱాప్రగ్గడా! ఈత డెవ్వడో కాని, నా కీతని గౌగలించుకొ
ని ముద్దాడ నపేక్ష గల్గుచున్నది సుమా!

(తె ర లో)

ఓహో! ఎఱ్ఱాప్రగ్గడ యెక్కడ! ఎఱ్ఱాప్రగ్గడ ఎక్కడ! దక్షిణద్వారము రక్షణము రహితమై యున్నది. ఆయన నాదెస నుండుమని చెప్పుడు. లేదేని యాదారి రిపులు పురమున ప్రవేశింప గలరు.

ఎఱ్ఱా—మహారాజా! నేను దక్షిణ ద్వారమున కరుగుదును. ఇంక మనకు పరాజయ భీతిలేదు. మీరు శాంతముగ పరుండుడు.

(అనవేమారెడ్డిని పరుండబెట్టి నిష్క్ర)

అన_వే—(పరుండి నిద్రలో వణకుచు) తల్లీ! యెవ్వరునీవు? త్రిశూల పాణివై — నాపై కేల విజృంభించి వచ్చెదవు? నేనేమి జేసితిని. ఏమి? నీవు రెడ్డి సామ్రాజ్యలక్ష్మినివా? తల్లీ! అట్ల యిన నా దెసకు రాకుము.

గీ. విశ్రుతాన్వయ గౌరవాపేక్ష మాని
శాత్రవుల గొల్చినట్టి విశ్వాసహీను,
లను, వధింపఁగ నగుగాని నను వధిం
నేమిపని? రెడ్డిరాజ్య రమా మతల్లి.

ఏమి? నీవు నట్టివాడవే యనుచుంటివా?_ పుత్రద్రోహి వనుచుంటివా? అవును నేను పుత్రద్రోహినే! కావుననే ఇట్టు లేడ్చుచుంటిని. పుత్రునిఁ బాసిన దుఃఖమే నీ శిక్షకన్న నధికమై యుండ, నీవేల నన్నింకను శిక్షింపవలయును._ అమ్మా! రెడ్డి సామ్రాజ్య లక్ష్మి - నీవు సర్వశక్తి క్రియాస్వరూపిణివి- నా కుమారుని నా కిమ్ము. నీ యానతిచే వాని నీసామ్రా

జ్యాధి నాయకుని జేసెదను. జేయకుండిన నా శిరస్సు గొను ము. తల్లీ ! క్రోధ కటాక్షముల తోడనే తిరోహితవై పోయి తివా! అట్లయిన నాగతి నేమి చెప్పి పోయితివి? నాకు మర ణమే శరణమా—— తండ్రీ! ఖడ్గనారాయణా! నీవు నన్ను డబాసి పోవుటచేత గదా నాకీగతి ప్రాప్తించెను- నాతండ్రీ! నీ వియోగ దుఃఖమును నేనెట్లు సైరింతును. కుమారా ! కుమారా ! (మూర్ఛిల్లును)

(రాణి రహస్యముగా కరవాలముం గొనివచ్చి రాజును చంపబోగా కొండారెడ్డి వచ్చి చేయి పట్టుకొనును. )

కొండా— ఓసీ హంతకీ! పూజ్యుడగు మహారాజునే చంప దలచు చుంటివా! నీ కంఠము నుత్తరింతును చూడుము.

(చంపబోవును.)

( కరవాల హస్తుడై ఖడ్గనారాయణుడు అనపోతనాయని బంధించిన వీరభద్ర, కళాపూర్ణులు ప్రవేశము )

ఖడ్గ— సోదరా! ఇది యేమి పని?

కొండా— సోదరా! నీ వడ్డము రాకుము, ఇది మన మహారాజునే చంప దలచినది. దీనిని బ్రదుక నీయ గూడదు.

ఖడ్గ— నామాట వినుము. స్త్రీహత్య మనకు తగినదికాదు.

కొండా— ఓసీ ! తులువా! నీ ప్రాణములను మాత్రము వదలితిని. నీకు బంధనము తప్పదు.

( వీరభద్ర కళాపూర్ణులు రాణినిబంధింతురు.)

అ-వే— (లేచి) మీరందరు నెవ్వరు ?

కొండా—రాజేంద్రా! నాయపరాధములు క్షమింపుము. నేను కొండా రెడ్డిని.

అ-వే—ఓరీ! కొండారెడ్డీ నాపుత్రుని బంధింపఁ జేసితివి గాదా! నీ యుసురు తగిలియే-నేనిప్పటికి పుత్రహీనుఁడనై యున్నానురా!

కొండా—మహారాజా! నాద్రోహములకు ఫలము ననుభవించితిని. ఇఁక నాకు ప్రాయశ్చిత్తము వలదు. నీదాసుడను నన్ను- మీ రెడ్లలోఁ గలుపుకొనుము. అనపోతనాయని బంధించి తెచ్చితిమి.

ఖడ్గ—రాజేంద్రా! అనపోతనాయని రాణి మిమ్ము వధింపవచ్చుచుండఁగా—నీ కొండారెడ్డియే మిమ్ము రక్షించెను.

అ-వే—కొండారెడ్డీ! చిరాయుష్మంతుఁడవు గమ్ము నాయనా! కాని యీ ముసలి వానిని — చావనీయకుండ, రక్షించితివేలనయ్యా

కొండా—ఇఁక మీ కేల విచారము? అనపోతనాయుఁడు బంధితుఁడై మీయెదుట నున్నాఁడు, చూడుడు.

అ-వే—ఈతని నెవరు బంధించిరి.

కొండా—ఈ కేదారనాథుడు—

అ-వే—నాకుమారుఁడు బంధింపలేదా?

కొండా—లేదు—

అ-వే—అట్లయిన యిక నాకుమారుఁడు నామొగము చూడఁడు. కిని, నాకును. ఋణము తీరిపోయినది.

కొండా—ఇంకను నీకుమారు డెక్కడ? ఇదిగో శిరస్సు!

అ-వే—హా! కుమారా!! మూర్ఛిల్లును.)

(తెరవ్రాలును.)

---

2 వ రంగము—ధరణికోటలో.

(అనవేమారెడ్డి దర్బారు)

(బంధితులగు అనపోతనాయుఁడును రాణియు నొకప్రక్క నుందురు.)
అనవేమారెడ్డి, ఎఱ్ఱాప్రగ్గడ, రామాప్రగ్గడ, మల్లినాథుఁడు కృష్ణరాజు) కొండారెడ్డి, ఖడ్గనారాయణుఁడు, కళాపూర్ణుఁడు, వీరభద్రుఁడు ప్రవేశింతురు,

అ-వే—ఎఱ్ఱాప్రగ్గడా! అందఱును వచ్చిరా?

ఎఱ్ఱా—ఆఁ! వచ్చినారు—

అ-వే—అయ్యయ్యో! మొండినై వీరందఱకు, నాపాడు మొగము చూపించుచు—చెట్టంతకొడుకును మ్రింగి తుదకు విధిలేక, సభలు సయితము సాగింపవలసివచ్చెనా? నన్నేల శత్రురాణిచే చావనీయక, కొండారెడ్డి బ్రతికించెను?

గీ. జయము లభియించెనను, సంతసంబు నాదు
హృదయమునఁ దోపదొక్కింతయేని గాని,
రణఫలంబు, కుమారమారణ ఫలంబె
గాని, నాకిది విజయంబు గాదుగాదు.

ఖడ్గ—(దగ్గరకువచ్చి) స్వామీ! తమ కుమారులము మేమందఱమును గామా! తమకు కుమారులు లేని కొఱత యేమి?

అ-వే—ఎవరు మీరు?

ఖడ్గ—స్వామీ! రాచకొండ రాజును- రాణిని బట్టితెచ్చిన కేదార నాథుడను సన్యాసిని-

అ-వే—అయ్యా! సన్యాసివగు నీ కింత పరాక్రమ మెక్కడనుండి వచ్చెను?

ఖడ్గ—యోగులకు సర్వశక్తులును, గరతలామలకము లని యెఱుగరా.

అ-వే—అయ్యా! నీవు శత్రురాజును బట్టుటచేత నా కుపకారము చేయబోయి యపకారము చేసితివి సుమా?

ఖడ్గ—అయ్యా! నాయపకారమేమి?

అ-వే—అపకారమే కాదా! అనపోతని బంధింపక నా మొగము చూడనని గదా, నాకుమారుఁడా సభలో ప్రతిన బట్టెను. ఇప్పుడు—వాని కనపోతని బంధించుమార్గము లేదు. నాకు వానిని చూచుప్రాప్తిలేదు.

ఖడ్గ—అంత పుత్రవాత్సల్యముగల మీరట్టి పరుసలచేనేల మీ కుమారుని నిర్బంధించిరి?

అ-వే—అదేనోయి నాయినా! నాబుద్ధిహీనత. అదేనోయి.

చ. మతిచెడి, వార్ధకంబునఁ గుమారునిఁ దిట్టి పరాభవించితిన్;
ప్రతినయొనర్చి—పుత్రకుఁడు బంధుల రాజ్యము వీడిపోయె నా
కుతుకము గంగలోఁ గలిపె; కూర్చెడువా రెవరింక నాకు, నా
మృతికిఁ దిలోదకంబు లొనరించెడు వారును లేరు ధారుణిన్.

ఖడ్గ—చిన్నకొడుకున్నాడుగదా!

అ-వే—చిన్నకొడుకా? ఎవరు కలగనిరి! ఇంతకొడుకట్లయ్యెనుగదా! ఇక వీడా? ముక్కులోని వెండ్రుక కొప్పులోని కెదిగినమాట గదా! అదిగాక, వాడును యుద్ధమున గాయములు తగిలి వైద్యుల చేతులలో నున్నాడు!

ఖడ్గ—రాజేంద్రా! అట్లయిన, నేను నీకు తలలో నాల్కగానుండెదను. పెద్దకాలమున మీ ముప్పు వెడలించెదను. నన్ను పెంచుకొనరాదా?

అ_వే— మీకంతటి యనుగ్రహ మేలకలుగును? మీరు సర్వశక్తులు
గల యోగి సత్తములు గదా!

ఖడ్గ— మీకాభయమేల? నేనుండెద ననుచుంటినిగదా !

అ_వే— ఆహా! అట్లయిన పెంచుకొందును గాదు- నన్నే నీవీ పెద్ద
కాలమున కుమారునిగా పెంచుకొనుము తండ్రీ! యిటు
రమ్ము. నిన్ను జూచిన నా కుమారుని జూచినట్లానందము
గల్గుచున్నది.

చ. పులకలుగల్గె; దేహమున పుత్రతనూలత దాకినట్లు నా
యలమట పోయె తాపము,లయంబయి,చందనిసాంద్ర చంద్రికా
కలిత, హిమాంబుపూర వరకర్పూర లేపనమైన భాతి నా
యలంత యణంగె నయ్య! తనయా! నను జేరగరమ్ము బిగ్గరన్.

(తొడలపై గూర్చుండ బెట్టుకొని )

ఏమి యీ మహానంద పారవశ్యము !

గీ. ఎవని కడుపుననో జనియించినట్టి
వీని నాలింగనమ్ము గావించినంత
నా యనుగు కుర్ర ఖడ్గనారాయణుండు
మరపునకు వచ్చుచుండె విస్మయము నిండె.

అన్నట్లు నాయనా ! నీవు సర్వశక్తి స్వరూపుడ నంటివే!
అంత యమేయ శక్తి నీయందున్నచో - నాకుమారుని, నీ
శక్తిచే దెప్పించి నా కీయవేల?—

ఖడ్గ—అయ్యా! ఇదియేమి న్యాయము! నన్ను మీరిప్పుడేకదా
పెంచుకొంటిరి. మీ కుమారుని నేను తెప్పించి, యిచ్చినచో
నీ రాజ్యమున కధికారి యాతడా? నేనా—?

అ_వే__నీకే రాజ్యము నిచ్చెదను. అతఁడు, నీకు సేవచేయుచు తమ్ముఁడై యుండును.

ఖడ్గ__అట్లాతఁడు సమ్మతింప వలయునుగగా! నాకేమి నమ్మకము;

అ_వే__అయ్యయ్యో! నాకుమారుఁ డట్టి యవిధేయుఁడు కాఁడయ్యా అతఁడు నే- గీచినగీటు దాటఁడయ్యా! నేనే దుర్మార్గుడనై వాని నింతఁ జేసితిని. నాయనా ఖడ్గనారాయణా! ఎక్కడ నున్నావురా తండ్రీ!

ఖడ్గ__అయ్యా! మీ విచారముం జూచిన కొలదియు, నాకు జాలి యగుచున్నది. పోనిండు. మీ కుమారుఁడు నాకు రాజ్య మీయనిండు. ఈయక పోవనిండు. నే నిప్పుడే మీ పుత్రుని మీకుఁ దెప్పించి యిచ్చెదను. ఒక్క క్షణము కన్నులు మూసికొనుడు,

అ_ వే__ ( కన్నులు మూసికొనును )

ఖడ్గ__ వీరభద్ర కళాపూర్ణులారా మీరీవస్త్రమును నాకడ్డముగ బట్టియుంపుడు.

వీర- కళా__ (అట్లు చేయుదురు. )

ఖడ్గ__ (రూపముమారి భిల్లుడగును )

వీర- కళా__ ( కాండపటము తీసివేయుదురు. )

అ_వే__ ఆహా ! యేమిది. కేదారనాథా! మాకు ధరణికోట యుద్ధమున జయము గల్గించిన భిల్లుడు కనబడుచున్నాడు.

అందరు__ జయ్ ! భిల్లవీరునకు జయ్.

వీర- కళా__ ( తిరిగి కాండపటము మూయుదురు. )

ఖడ్గ__(అష్టను వేషమున కనబడును)

వీర___కళా—(పటము తీసివేయుదురు) ఏమిది? ఈ దుష్టుడు - అన పోతనాయునికి నాపై నలుకఁ గల్పింప - వెంకన్నకు లంచ మిచ్చిన యాఫ్ఘనులలో నొక్కఁడు!-

అనపో—అయ్యో! ఆఫ్ఘను వీరా! నన్ను రక్షింప రమ్ము — ఈ దుర్మార్గులు నన్ను బంధించి బాధించుచున్నారు.

కొండా___ఛీ! దుష్టరాజభూతమా! ఇప్పుడు నిన్ని యాఫ్ఘను తుచ్ఛుడు రక్షింప వచ్చునా? నోరుమూయుము. వాఁడు నీ కన్నుల యెదుట ఖండింపఁబడును. చూడుము. ఓరీ!___ఆఫ్ఘను పిశాచమా అప్పుడటు శత్రునికడనుండి బ్రతికి పోయితివి; గాని, యీ రెడ్డిసభలోన ___ వంటయింటి శశమువలెఁ జిక్కితివి. చూఁడు; నిన్నేమి చేసెదనో___

గీ. నీచుఁడైనట్టి వెంకన్నతో చెలిమి వ
హించి నాయందు నిందఁ గల్పించి శత్రు
రాజుచే నాడు నన్నుఁ బరాభవింపఁ
బ్రేరణము జేసి తిపుడు నూఱేండ్లునిండె.

అ-వీ___(కాండపటము మూయుదురు.)

ఎఱ్ఱా___(పట్టుకొని) కొండారెడ్డిగారూ! ఏమి యీ తొందరపాటు- ఇది కేదార నాథుని మంత్రశక్తిగాని నిజము కాదు.

కొండా___ఊఁ_కేదారనాథుఁ డెవ్వఁడో___నేనెఱుఁగక పోలేదు.

ఖడ్గ___(నిజాకృతిని దాల్చును)

అ_వీ___(కాండ పటము తీయుదురు.)

అ_వే___(పారవశ్యముతో వణకుచు) కుమారా! కుమారా! ఖడ్గనారాయణా! ఖడ్గనారాయణా! వచ్చితివా! (కౌగిఁలించు కొనఁబోయి మూర్ఛిల్లును.)

ఖడ్గ—(దగ్గఱకు బోయి శిరస్సును తొడపై నుంచుకొని) హా! జనకా! నీకు నేనెంత దుఃఖముఁ గల్పించితిని.

సీ. ఆగ్రహచిత్తుండ ననుకొంటినేగాని
 యీ పుత్రవాత్సల్య మెఱుఁగనైతి
పరిభవించితివంచుఁ బరితపించితిఁ గాని
 యీ న్యాయపాలన మెఱుఁగనైతి
దుడుకునై నిన్నొత్తి పొడిచితినే గాని
 భరమైన నీ దుఃఖ మెరఁగనైతి
కఠినచిత్తు గనని న్గణియించితినె కాని
 యిటులఁ గృశింతు వం చెఱుఁగనైతి

గీ. పుత్రజీవన జీవనాభ్యుదయు నిన్ను
 తప్పదలఁచితి; నీ ప్రేమఁ దలఁపనైతి
 నీ సమాశ్లేష సౌఖ్య మందితిని గాని
 యనుఁగు తండ్రి! నిన్గని దుఃఖ మందనైతి.

అ-వే—(లేచి) తనయా! ఎన్నినాళ్ళకు నాకన్నులఁ బడితివి తండ్రీ! నా మొండి ప్రాణములు నిన్ను చూచుటకుఁగదా యిన్ని నాళ్ళు బ్రతికియున్నవి! నాయనా! నా ప్రాణములు నిలుపుటకు గదా నీవు తిరిగి వచ్చితివి!

(47 వ అనుబంధము)

ఖడ్గ— నా యపరాధములను క్షమింపుము. నాకై దుఃఖింపకుము. కన్నులు తుడుచు కొనుము.

అ-వే...కుమారా! అట్లయిన నీవును నన్ను క్షమింపవలసియున్నది. కేదారనాధునకు నీ రాజ్యము నిచ్చునట్లు – వాగ్దానము చేసితిని. నామాట నిలుపుము, ఏఁడీ ... కేదారనాధుఁ డెక్కడ! ... ...

ఖడ్గ—నాయనగారూ! కేదారనాధుఁడు నాలోఁ గలసిపోయినాఁడు ఇఁక మీకు కేదారనాధుఁడు గాన్పింపఁడు.

అ-వే—ఏమీ! అట్లయిన నీవే కేదారనాధుఁడవా!

ఖడ్గ—ఒక్క కేదారనాధుఁడనే కాను. చిత్తగింపుఁడు.

సీ. అనపోతనాయని యాస్థానమందు క
పటవృత్తి నున్న యాఘనుఁడ నేనె

కొండా—ఆఁ! ఏమీ! ఆశ్చర్యము! అట్లయిన మిగత యిద్దఱాఘనులు నెవ్వఱు?

ఖడ్గ—ఒకఁడు నేను - ఇంకొకఁడు మల్లినాధుఁడు — మరియొకఁడు కృష్ణరాజు - అనపోతనాయనికిని నీకును విరోధము గల్గిన గాని నీవు మా పక్షమునకు రావని వెంకనన్నను లోఁబఱచు కొని రాణితో నీకు సంబంధమునుఁ గల్పించి - బుద్ధి పూర్వకముగ ననపోతనాయనిచే నీకు పరాభవము చేయించి తిమి. మమ్ము క్షమింపుము.

కొండా—అయ్యా! మీరు చేయించినది నాకు పరాభవము కాదు. నిజముగా నాకు మహోపకారము.

అనపో—ఆహాహా! ఎంతమోసమునకు లోఁబడితిని

రాణి— (భర్తతో) ఓగుఱ్ఱిడ్డిరాజా! ఇప్పుడైన నిజము తెలిసికొంటివాః

అనపో—తెలిసికొంటిని - నేనేమి చేయుదును?

రాణి—ఏమి చేయుదువు. దుఃఖింపుము - ఒడిలోనివి తాఱ్ఱిచు బాములని యెఱుంగక ఆఘను వేషములను విశ్వసించి రెడ్లన్న తలఁ దాల్చుకొంటివి. అనుభవింపక తీరునాః

అనపో!—దేవీ! చచ్చిన బురదపామునను కొట్టనేల?

ధాణి—కొట్టుట చాలదు; నిన్ను చంపవలెను.

ఖడ్గ—సీ. అనపోతనాయనిఁ గొనితెచ్చి నీపాద
తలి నుంచినట్టి పుత్రకుండ నేనె

అందఱు—జయ్! ఖడ్గనారాయణునకు జయ్!

ఖడ్గ—సీ. ధరణికోటను శత్రువరుల రూపడగించి
విజయమందిన భిల్లవీరుఁ డేనె

ఎఱ్ఱా—ఆహా! ఏమి యీ మాయాభిల్లుని ప్రతాపము!!
అందఱు—జయ్! మాయాభిల్లునకు జయ్!

ఖడ్గ—సీ. సభలోన నానాఁడు చెప్పిన ప్రతిన దీ
ర్పఁగఁ గన్నమీ యువరాజు నేనె

అ-వే—నాయనా! నీఖడ్గనారాయణ బిరుదమును తిరిగి నీకిచ్చితిఁ. నీకు యౌవరాజ్య పట్టాభిషేకమే కాదు పట్టాభిషేకమునే చేయుచున్నాను.

ఆ. ముసలినైతి భారమును దీర్పఁగా లేను
ప్రభుఁడ వీవె రెడ్డిరాజ్యమునకు
గాన నీ భుజాగ్ర కలితాసనంబున
పూజ్యయగును రెడ్డి రాజ్యలక్ష్మి (కిరీటముంచును.)

అందరు—(కరతాళములు చేయుదురు.)

ఎఱ్ఱా—సభ్యు లెవఁడును లేవవలదు. ఇంకను విచారింపవలసిన యభియోగములు చాలగలవు. మీరు చూడవలసిన చిత్రమంతయు నిప్పుడే.

అ-వే—నాయనా! ఖడ్గనారాయణా! ఇప్పుడు రాజువు నీవే. కావున బంధితులై యున్న మన శత్రు దంపతులకు శిక్ష - నీవే - విధింపుము.

ఖడ్గ—కొండారెడ్డిగారూ! మీయుద్దేశ్య మేమి?

కొండా—ఈవిశ్వాస హీనులకు జన్మాంతర కారాగృహ శిక్ష విధించినను పాపములేదు.

రాణి—రాజేంద్రా! ఈపిటికిపందయగు రాజును వివాహమాడినందు వలన నేనుసయిత మిట్టిగతికి లోనైతిని. క్షత్రియుని కడుపున నిట్టివాఁడు పుట్టెననిన నా కాశ్చర్యముగా నున్నది.

ఎఱ్ఱా—సభాసదులారా! ఈవిషయమున నా మనవి యొకటిగలదు. రాణి సందేహము దీనితో దీరును. వీరభద్ర జననీజనకులు భిక్షుకులై తిరుగుచుండఁగా-నేను మాయింటనుంచి రక్షించుచున్నాను. వీరారెడ్డి-యీ యనపోతనాయని జన్మ రహస్యమును నాతోఁ జెప్పెను. ఈతనితల్లి పుత్రసంతతిలేక యొక దాసీపుత్రునిఁ బెంచుకొని తన తనయును దాసి కిచ్చివేసెను. ఇతఁడు దాసీపుత్రుఁడుగాని క్షత్రియుఁడు గానేరఁడు. ఆదాసి కొసంగఁబడిన బాలికయే నీలయఁట దాసి తన మరణకాలమున వీరారెడ్డిచే పోషింపఁబడి ఈరహస్యము నతని కెఱింగించెను.

రాణి—ఆ! ఏమి? నేనెట్టి పరాభవ వాక్యములను వినుచుంటిని. ఈ నీచుని ప్రవర్తనమును నేను తొలుతనుండియు సందేహించుచునే యుంటిని. పూజ్యమైన మావంశమునకీ దుష్టునివలన తీరని మచ్చఘటిల్లెను. ఎన్నినాళ్ళ జ్ఞానమున నెఱుఁగక వీనితోఁ గాపురము చేసితిని? ఛీ! ఇఁక నాకీ జన్మమేల? వీనిని సంహరించి నేనును వీరశయన మలంకరించెదను. (బంధనములు తెంచుకొనును.)

అనపో—రాణీ! రాణీ! సాహసింపకుము.

రాణి—ఛీ! బానిసా! నాకింక శాంత మెక్కడిది? మన మిఱువుర

ము ను బ్రతికి యీ రెడ్లచే బరాభవము నందుటకన్న మరణమే శ్రేయమని నీకేల తోఁపదయ్యెను. చావుదురాత్ముఁడా!

(రాజును చంపి తానును పొడుచుకొనును)

అందఱు—హా! ఘోరము — ఘోరము.

ఎఱ్ఱా—పభిట్టాషేక మందిరము శవసహితమగుట శ్రేయము కాదు. తొలఁగింపవలయు.

(ఇటుల ఇద్దఱిని తొలఁగింతురు)

ఖడ్గ—కొండారెడ్డిగారూ! పాపము తొలుతనుండియు మీరు వీర భద్రిను వలచి యుండిరే! ఆమె యిప్పుడు మీకు కావలెనా?

కొండా—మిత్రమా! ఏమిది? నన్ను పరీక్షించుటకా యిట్లడిగెదవు? నీవు ప్రేమించిన భాగ్యవతి నాకు మాతృతుల్యురాలుగదా కావలయును.

ఖడ్గ—అట్లుకాదు! నేనే యొకవేళ సమ్మతించి మీ కిచ్చివేసినచో

కొండా—వలదు; అట్టిమాటలు మీ రాడుటయు నేను వినుటయు ధర్మ విరుద్ధములు - అదిగాక నేనీ జన్మమున వివాహమును మానుదునని ప్రతిజ్ఞ చేసికొంటిని.

ఖడ్గ—ఎందుచేత?

కొండా—నన్నెంతో బలవత్తరముగ ప్రేమించినట్లు — పైకి నటించుచు అన్నపూర్ణ రహస్యముగ మఱియొకనితో వ్యభిచ రించుట నేను చూచితిని. అప్పటినుంటియు నీ ప్రపంచమున సత్యప్రవర్తనము గల యాఁడుది లేదనియు నాకు వివాహమే వలదనియు నొకటే సంకల్పము చేసికొంటిని.

కళా—అయ్యో అన్నపూర్ణ యెవ్వనితో వ్యభిచరించెనో చెప్పఁ గలరా?

కొండా—విక్రమరాజుతో

కళా—అంతేనా? మఱి యెవ్వఱితోనైననా?

కొండా—మఱియొకరి విషయమును నేను చూడలేదు ... వినలేదు ... మఱియొకరేల కావలయు? విక్రమరాజు చాలఁడా? వాఁడు మగవాఁడు కాఁడా? వానితో స్నేహము తనకు నింద్యము కాదా!

కళా—కొండారెడ్డిగారూ అదేమిమాట? ఆమె తొలుత మిమ్ము వలచినదఁట! మీరు నిరాకరించితిరఁట! - అప్పుడు తనదారి యేదియో చూచుకొన కుండునా?

కొండా—కళాపూర్ణా! నీకు దెలియ దూరకుండుము.

అ-వే—ఔను - పాపము వీరభద్రాన్నపూర్ణ లేరీ!—

కళా—మహారాజా! మేమిందే యున్నాము.

(వేషములు దీసివేయుదురు.)

అ-వే—నాబిడ్డా! వీరభద్రుఁ డను పేరుతో పురుషరూపముననుంటివా! నీ తండ్రియు నేనును ప్రాణమిత్రులము నాతల్లీ! దగ్గఱకు రమ్మ.

వీర—(సమీపమున నిలుచును)

కొండా—హా! దుర్మతీ! అన్నపూర్ణా! కళాపూర్ణ అను పేరుతో నున్నది నీవా? నన్నెంత మోసగించితివి!

విక్రమరాజు ప్రి॥)

అన్న—బావా! నన్ను క్షమింపవా?

కొండా—నిన్నింక క్షమించునదియేమి? నీవు. విక్రముని వలచితివి గదా! పొమ్ము. వానిదగ్గఱకే పొమ్ము.

అన్న—పోనిమ్ము నీ కిష్టములేకున్న నేనేమి చేయుదును. విక్రముని దగ్గఱకే పోవుదును. ప్రాణేశ్వరా! విక్రమరాజా! వచ్చితివా? (విక్రముని కౌగిలించుకొనును.)

కొండా—ఛీ! కులటా! తెంపరివై యింతటి సభలో నొక తుంటరి నాలింగనము చేసికొంటివా? నిన్ను చంపెద నుండుము.

అన్న—(నవ్వుచుండును)

కొండా—ఏమి నవ్వెదవు? నన్ను వెఱ్ఱివానిగాఁ దలఁచితివా?

అన్న—బావా! నేనే గెలిచితిని.

కొండా—ఛీ! నీవు గెల్చుటేమి?

అన్న—నాడు చెఱసాలలో నేనే గెలుతునంటినే! మఱచితివా?

కొండా—ఔను జ్ఞప్తియున్నది! ఉన్నది?

అన్న—అటు చూఁడు—

(విక్రమరాజు నీలగామారును)

కొండా—ఈ బాల యెవ్వరు?

అన్న—విక్రమరాజు

కొండా—ఈమె నీలగాదా? నీల చచ్చెనని వింటిమే?

నీల—నీలచచ్చి విక్రమరాజయ్యెను. విక్రమరాజుచచ్చి నీలయయ్యెను నీలావిక్రము లకు భేదమేమున్నది.

కొండా—ఔరా! ఏమి యీమోసము ఈవనితలు ముగ్గురును పురుషాకృతులను ధరించి చిత్రచర్యలొనరించిరి కాబోలు.

అన్న — బావా! నేనే గెలిచితినా?

కొండా— మరదలా! నీవే గెలిచితివే!

ఖడ్గ — జనకా! ఈ వీరభద్ర సంగ్రామమున నా ప్రాణములను రక్షించినది. ఈమెకును పురుషాకృతులతో మనకు జయము గూర్చిన నీలాన్నపూర్ణలకును బహుమానములు చేయవల యును.

అ-వే——నాయనా! అదే నేనును చూచుచున్నాను. ఈ రెడ్డివిజయ సందర్భమున వీరభద్రా ఖడ్గనారాయణులకును, అన్నపూర్ణా కొండారెడ్లకును, నీలాకృష్ణరాజులకును నాచేతులతో కల్యా ణములు చేసి కృతార్థుఁడను కాఁగోరుచున్నాను. అదిగాక అనపోతనాయని తమ్ముఁడగు మాధవనాయఁడు ధరణికోట యుద్ధమున మరణించి నందువలనను, దాసీపుత్రుఁడగు నన పోతనాయని యనంతరమున రాచకొండకు నిజమైన వారసు రాలు నీలయే కావునను, నీలాకృష్ణరాజులకు తద్రాజ్యము నొసంగుచున్నాను.

అందరు——(కరతాళములు చేయుచు) రెడ్డిరాజ్య లక్ష్మికీ జయ్! రెడ్డి రాజ్య లక్ష్మికీ జయ్! (యథావిధిగా కల్యాణములుచేయుదురు)

మంగళం మంగళం మహత్ శ్రీ శ్రీ శ్రీ

గద్య.

ఇది శ్రీ సోమరాజాన్వయ పయఃపారావార రాకాసుధాకరుండును, కోదండరామ చూడమాంబా గర్భ శుక్తి ముక్తాఫలంబును శ్రీభద్రాచల సీతారామచంద్ర వరప్రసాదలబ్ధ కవితావిభాసి తుండును, భారద్వాజస గోత్ర పవిత్రాపస్తంబ సూత్రుం డును, నగు దేశపాండ్య రామానుజరాయ కవివరేణ్య ప్రణీతంబైన రెడ్డిసంగ్రామవిజయనామాంతరంబగు ధరణికోట నాటకంబున సప్తమాంకము సర్వంబును సంపూర్ణము

—०—

(20)

# అనుబంధములు

## 1. అన్నపూర్ణ—కన్నడ—ఆది.

ఓహోహో । సుమశరుఁడో యీతండూ ॥ఓ॥ సరసిజమన దగు । ముఖకమలము గన । సంతసమయ్యెను కల్యాణీ ॥ఓ॥ భువి కే తెంచిన యిందు్రిండో । పూర్ణకళాయుత చంద్రుండో । సుదతియిం తటి సుందరుఁ గనఁగొన । కనులకు విందై కనుపడెఁగా ఆశ్చర్య । మయ్యెగా । దినమున । వెలిగెడుగా ॥ఓ॥

## 2. వీరభద్ర—బ్యాగ్—ఆది. (ఎంతటి పురుషార్థంబనుచు వలె)

ఎంతటి పరిహాసంబుఁను గావించెదవో । ఓతరళేక్షణ నీ॥వెం॥ స్వాంతము నందున ననుమానింపక । సరసిజముఖి నా । వలెనెటెఁగిం ప్పని ॥వెం॥ (సాకె) ఆ మదీయ మానస చోరుండు । అభిమాన । ధనుండు । మనసిజ తేజుండూ ॥ఆ॥ మదనసముఁనిఁ బొగడనిమది నిదురను సుఖమును విడచితి । నాధీరుని పొడగాంచెద । నెటగాం చిన నీ ॥వెం॥

## 3. వీరభద్ర—హనుమతోడి—ఆది.

విమలోజ్వలాంగినా।వెతనెంత దెల్పుదు ॥వి॥ జలజాత నేత్రినిగూడు టేనాటికో ॥వి॥ 1. జనకుఁడు ధరణికోట । జననాధ పుత్రిని । సఖి యరో నాకుఁ గూర్ప । సంకల్ప మొనరించె ॥వి॥ 2. నిన్నటిరాతిరి । నెనోన్నివిధంబుల । ననుఁగూర్చి మనవారు।తలపోసి నారమ్మా ॥విమ॥

## 4. ఖడ్గనారాయణుఁడు—భీమ్‌పలాస్—రూపకం.

ఆహా నే ధన్యుడన్ । అనుపమగుణ మాన్యుఁడన్ ॥ఆ॥ దేహ గేహములు పవిత్ర । తనుగనె । నఘములు సమసెను ॥ఆ॥ చెలుకు వంటి జోడు । విడ । చిన ఫిరంగిగుండు । చెదరి హృదయసీమనెల్ల । విశాలికలు జేసెను ॥ఆహాహా॥

5. ఖడ్గనారాయణుఁడు—సురట—త్రిశ్రగతి.

ఏమనివర్ణింపఁగలను । భామాసౌందర్యమహిమ ॥మే॥ కాముని చే ములికిదో ॥జ॥ గన్నుతయగు కలికియో ॥యే॥ మోహన రూప విభాసిత । ముజిజత చంద్రవిలాసిత।యాహా కనులకుగట్టిన ।యటుల దోచు సుందరి । నే ॥నేను॥

6. కొండారెడ్డిబ్యాస్—ఆది. (హరహర నా సోదరునిటువలె)

ఆ వీరభద్రఁ గామించినయా-హంతకు, దుంపక వేడెదనా-చోరుఁడుపాపవి - చారుఁడు కలుషవి - హారుఁడు సుగుణవి-దూరుఁ డుగా ॥ఆ॥ఖలుండుమా నసమునమ-త్సరమున మా - నవతిగనెన్॥ఆ॥

(సాకె)ఆకలుష విచారుండు ఖడ్గనారాయణుండూ-హా మదీయ మాతులాంతః పురచోరుండూ-పద్మనాయకాఖండరాజ్యగర్భవైరుం డూ - రెడ్డిభూనాధాభి మానుండూ-మిత్రపద్మనాయకులను - బరి మార్పగానెంచి - బద్ధవైరముబూను పాపాత్ము నెమ్మేను - ఖండ ఖండములుగ - గావింతుగా ॥ఆ॥

7. అన్నపూర్ణ—కన్నడ—ఆది. (శాపము విడుమమ్మావలె)

కోపము విడుమయ్యా-మామీాదనీ ॥కో॥ నీపయిసుంతయు - పాపము దలఁపము ॥కో॥ విమల శీలసా- ధు సుగుణజాలను - విశ్రుత చరితను- వీరభద్రను - ఎన్నికష్టముల ముంపనున్నావో- నీ పాదము లను నిరతము గొలిచెద ॥కో॥

8. అన్నపూర్ణ—మోహన—రూపకం.

యింత నిరాకరణము నీ - కేలఁ గలిగెనో నాధా ॥యిం॥ పంత గించి - భ్రాంతిముంచి పరిభవించుట యిదివాదా॥యిం॥మఱదలిపైఁ గృపారసము - మఱచితివో - గుణభూషణ - కరుణలేక-కరమునీక - కఠినగుణము జూపెదవా ॥యింత॥

9. కొండారెడ్డి—భాగేశ్వరి—ఆది.

పో పడతి - నయమున భయమున - వీరభద్రితోడ దెలుపు కొమ్మా ॥పో॥ క్రూరుఁడైన ఖడ్గనారాయణుని-గోసి ముక్క-ముక్క-లుఁగ నొనర్చెద-నింకనైన నన్నుఁగోరుమనుచును — పలుకుమా - తెలుపుమా — నిరంతరము ॥పో॥

10. నీల—జంగ్లా—ఆది—(హా మమ్ముఁగాసి వలె)

హా - కృపారాశి నీకు దెల్పఁగా - దుః — ఖంతువీ—వేమొసో దరా హా — నేనొకహతభా - గ్యనుఁగాధరపయి — నే సౌఖ్యంబునె-ఱుంగ నే సతము హా- ఈదురాత్మునకు బానిస నయియిటు-లిడుమల నందుచు - నుంటినీపురిని - నిర్మలమగునీ - వదనాంబుజమునువీక్షిం పగ జీ- వము లభించెనకటా - కృపారాశి—

11. నీల—కన్నడ—ఆది

అనాథనైతిని పు — ణ్యాత్మనేనా - ఘనయాసమున గాసిలు చుంటినీ- జనాధిపుఁడు రో-షంబువహించెను-మనంబునందున నలతఁ గంటినిను - వినారక్షణము గానను జగతిని ॥అ—

12. ఖడ్గనారాయణుఁడు—మోహన—ఆది.

అభయముఁగొమ్మా - యతివాలెమ్మా - యనయము భయ రహితాత్మవుగమ్మా ఆ - పాతకుఁడగునన - పోత ధరాపతి- ప్రాణ ములిఁక నెడబాయుసుమ్మా - ఆ—

13. పరిజనులు—బ్యాగ్—చాపు.

మహారాజ రాజాధిరాజా - మహనీయ కవి కల్పభూజా-మ-
అహోనీపరితాపంబు - లాశాంతరములంటి-యరులన్ బరితారించు.
భూవరా-సమస్తఃపు భయంకరా - పరాకు భూవరా - మ—

14. మల్లినాథుఁడు—బ్యాగ్—ఆదితాళం.

ఔరా–మీరలిటుల కారులఱచి దూతను పరిభవింపఁ దగునా ॥ఔరా॥ శూరులగుచు ధీరులగుచు – న్యాయాన్యాయము లా వంతతెలియని – మదిని దలప కిటు పరుషము లాడందగునా॥ఔరా॥

15. వీరభద్ర—మాయామాళవగౌళ—జప్ తాల్.

ఈవియోగమహాంబు – నిధినెట్లు దరియింతు ॥ఈ॥ నావీర వరుని స– ఖ్యంబెటుల సమకూడు ॥ఈ॥ ఖలుండు కొండారెడ్డి కారా గృహమ్మున కో – మల శరీరుని నతని బంధించెఁ గటకటా ॥యీ॥

16. డైలాగ్—భీమ్‌ఫలాస్—రూపకం.

(అన్న) కళ్యాణీ-నీయార్తిన్ విడుమా – బాలామణిలో-నా యాసన్ గొనుమా ॥క॥ (వీర) పతివెతలన్ గుడువగా – మనంబుననే నేరీతిన్ – మనియెదన్ (అన్న) వనజనయన వేమరు నిటు – వగచిన ఫలితము గలదా (వీర) శశివదనా – బ్రదుకగనా – తరమగునా దమునా (అన్న) శుభమగు – విషయము – దెలిపెద ॥క॥

17. వెంకన్న—బ్యాగ్—ఆదితాళం.

చూడుచూడూ ॥నా। యందము చందము నెందైనగలదేమొ ॥చూ॥ నాదు మొగము తీరూ–తీ–రైన కనులసొరూ – నా పెదవి సుధలుగారూ –భా– వింపగ నుతిమీరూ – నన్ను బెండ్లియాడిన నీకెన్న సుఖము చేరూ – కలికీ – మరు ములికీ – కమలముఖి ॥చూ॥

18. అన్నపూర్ణ—బ్యాగ్—ఆది.

మూతిపండ్లు రాలగొట్టెదను చూడరా – పోపోరా ముసలీ ॥మూ॥ నీతిమాలి నా – తోపరిహాసము–నింద్యమతిని జెడనాడెదవా నాతులమొగ మెన్నడుగనలేదా – వాచిపోయెదవు – వారల గను గొని ।మూ॥

## 19. అన్నపూర్ణ—సురట—రూపకం.

నడు-వీధిలోన నవ్వులాట లేలా-నడునడు॥నడు॥ పడుచుతన ముశాసెక ॥కడు॥ ముసలితనము డాసెన్ - నడకలు తడబడుచున్నవి-ముడతలుబడె కాయము ॥నడు॥ ఇట్టిప్రియమందా - సీ - కిట్టి గుణము విందా - మట్టియైనపిదపగాని - మానవా గుణంబును ॥న॥

## 20. ఖడ్గనారాయణ - పూరి—ఆది.

దయాభరణ యాత్రశరణ్యా ॥రిపు॥ భయాహరణ ఘన-పతిత పావనా ॥దయా॥ స్వయంభూ - గుణాతీత - మాధవా - సకలదనుజ సంహార కేశవా - సారసాక్ష లోకరక్ష - బ్రోవగ - సమయమురా-సరగునరా - రాహరి ॥దయా॥

## 21. అన్నపూర్ణ - ఆదితాళం

మధు - పానమిదే - వరదానమిదే - ద్రా - క్షారసంబు దీ లోటా ॥మ॥ రుచిచూచినంత కడుమీఠా - సరి, దీనికి భువిని ఝాటా — ఘనసుఖజాలములకు బాటా - సుందరి దొరికిన సయ్యాటా ॥మధు॥ రవ్వంత దీనిరుచిచూడూ - పేరైన జావళిల్పాడూ - మాంసాహారమునకు తోడూ - తెలియకుండ తైతక్క-లాడు ॥మ॥ పరసుఖములీయ ఖామందూ - దు - ర్భరదుఃఖమునకు మందూ ఆ-నందమైన దీమందూ - భళి - దీనిమహాత్మ్యము నేమందూ ॥మధు॥

## 22. వెంకన్న - ఆది. (పర దేశీనయ్యా వలె)

ప్రితివాఁడూ నన్నూ - తాతాతాతా యంటారి దేమిపాపమో సంతాపమో - పరితాపమో ॥ప్రి॥ చెవిటివాఁడవను నొకతే - రేఁ-జీకటియను వేరొకతే - పండుతలను గని - ముసలివాఁడవని - పరిహాసము లాడు నింకొకతే ॥ప్రి॥

23. కొండారెడ్డి - బ్యాగ్ - ఆది.

హరుడే- వరభీ- కరుడై వెడలిన- నతనిని బ్రిదుకగ నిచ్చెదనా- సురనా - ఘుఁడుసే - నలతో గవిసిన - శూరతఁ జూపక విడిచెదనా ॥హ॥ నిరుపమ మగు నా- భుజాబలంబున - నిఖలశాత్రివుల బరిమార్తు౯ శౌర్యంబు జూపింతు - ధైర్యంబు దీపింతు - వారింపంగలేరిం కెవ్వాఁబలున్ ॥హ॥

24. డైలాగ్ - బ్యాగ్ - రూపకం.

మాధవ—భీతిని బొందకుఁ డింక ని - శాతకృపాణంబులనరి- వా్రితముఁ గూల్పెఁడు పరిజనులారా ॥భీ॥ పాతకుల నెల్లఁపరిమార్చి పసఁదూల్చి - పోకార్ప రే ధృతిమీర ॥భీ॥ (పరి) మీపదసేవల నే- పారఁజేసెదు - మీపరివారముగా నూ కోపంబు దీపింప - తాపంబు రూపింప - కడదేస్తు మతిదీప్తిమీర - (మాధ) ॥భీ॥

25. అనపోతనాయుఁడు - హిండోల్ - రూపకం.

నా - కేమో - త్రోపదాయెగా- ఈ చిత్రిమూ వి - నూత్న మూ మహాబ్రిమూ నా భీకరాగ్ని కీలలలో - విమలసుధా మయ సౌధము - లీ కరణిని గాలుచుండ - నిట్టి విపద్భరహేతువు ॥నా కే॥

26. డైలాగ్ - బ్యాస్ - చాపు.

అందఱు—దుష్టస్వరూపిణీ - దురితపచారిణీ - నిష్ఠురంబులు సల్పువారమిటుగనుమీ ॥దు॥ (నీల) త్రిశ్రి-ఓదయాహృదయులారా- మోక్షపాత్ములారా - సాదరులై ననుఁగావుడు సదలాంగులారా (అందఱు) —(చతురశ్రి) ఓకుటిలాత్మక యిటువినవే - భీకరశర మును గనుఁగొనవే — నీ కొనరింప మపాయమునూరిపు- నిజమర్మం బులు తెలుపఁగదే ॥దుష్ట॥

27. ఖడ్గనారాయణుఁడు—హిండోల్—ఆది.

కా - పాడక్ - ఇదే - సమయమురా అఅఆ ॥కా॥ (త్రిశ్రి) ఈ పాపాత్ములుశాత్రిపు - రిపుడునను వధింపదలచి - రాపద్బాంధవ నను సద - యాత్మసవైరక్షింపుము ॥కా॥ శ్రీపతినీదాసుండను - ప్రాపెవ్వఁడు లేరు నాకు — నీపయి భారముంచితి — గోపాలక కుజనశిక్ష ॥కా॥

28. కొండారెడ్డి — టీక.

ఎంతటి—యవమా—నమూ ॥ఎం॥ ఘటియింపగా—అఅఅఅఅఅ ॥ఎం॥ అదరక శాత్రిపుఁడఁడచిన—నుదుటిపైన గాయమయ్యె— పరాభవము నెటు సైచెద — ప్రాణభంగ మైననునా ॥కెం॥

29. అనపోతనాయడు బ్యాగ్ — రూపకం.

పుడమిదిరుగ — నడలుగదుర — చనుఁడు శూరులారా ॥పు॥ గడగడన్ వడంక జగము గదలుడిక కడంకన్ ॥పు॥ (సాకె) పద్మనాయక వీరవైరి శిఖామణులు — ఛద్మవేషులగు రెడ్డిరాజులధములూ అడలక — ననయము — బోరి — గొనుడికగొందల మందకుఁడీ ॥పు॥

30. జైలాగ్—బ్యాగ్—ఆది.

కొండా—వీరినిక—నాదుకర—వాలమునకు బలి—నేసెద—జేసెద— భూతబలిన్ ॥వీరి॥ శూరత గూర్చెద ధీరత బేర్చెద - శోణితమును భువిగార్చెదగా ॥వీరి॥

31. ఖడ్గనారాయణుఁడు—సారంగ—కుసుజంపె.

ఘోరాపరాధినై - కులధర్మము దిడిన ॥ఘో॥ వీరుండ నయ్యు కారాగారమునఁ బడితి ॥ఘో॥ రాయబారము జేయ—రాచకొండకుఁ జేరి— యనపోతనాయుని స_ భారంగమునను నటుల— అన్యాయబంధనము—లంది ఘనమానమును—ఘటియించి మీమనసు కలఁగఁజేసిన ఖడ్గుఁడ ॥ఘో॥

32 వ అనుబంధము గ్రంథమధ్యమున గలదు.

33. అనపోతనాయఁడు—బ్యాగ్—ఆది.

చెదఱిన హృదయము పదిలపడుటకిది శ్రీకరమగు సారా యీ॥ చె-అదటును బాపఁగ-హాయినిఁజూపగ- ననువైనది సుఖదాత ॥చె॥ నిదురనుగూరుప—నిధిసమకూరుప—నిజమైనది వరదాయీ— వద రగ గోరిక-వదలకనీరిక-లెత్తించుట కిదిఘాయీ ॥చె॥

34. అనపోతనాయఁడు—సురట—ఆది.

అనవసరముగా-సాక్ష్యము-లేనినింద-లిడదగదొక శూరునిపై ॥అ॥ నిజపుమాట బల్కుడు-బుజువుచూపి తెల్పుఁడు-శిక్షింతువాని ॥అ॥ అన్యుఁడతఁడు గాఁడు గౌరవాస్పదుఁడైనయట్టి కొండారెడ్డిపై న దుర్నయంబులను బలుకుచునుంటిరి - ద్రోహికాని యెడమీశిరము లూడు ॥నన॥

35. ముగ్గురుపఠాణీలు—బ్యాగ్—ఆది.

అగునని కాదని యీ రాద్ధాంతములిపుడేలా— వినరాదా నిజ ముం గనరాదా—విపరీత సిద్ధాంతంబులేటికి ॥అః మీపయికొండారెడ్డి యెంతద్రోహముసల్పుచుండెనో యెఱుగరుగా ఎఱుఁగకీరీతి నింబెను గోతిలోబడుటకు లజ్జింపరుగాదా॥అగు॥

36. అనపోతనాయఁడు—బ్యాగ్—ఆది.

చాలుచాలునిక సరసమూ—నీ సంగతిదెలసెను తులువాపలువా చాలు—వేళాకోళములయ్యెనా—నను- వెర్రివానిగాదలచితివా కాలుని వీటికి బంపగలను నిను కాచుకొమ్ము హంతకారి జారిణి — చాలు.

37. కొండారెడ్డి - బ్యాగ్ - ఆది

తగునా - మీరిటుపలుక - రాణియనఁగ—మానవతిగదా-అబ

ల యనక-గృహిణిగనక॥తగు॥ అనుపమశుద్ధాంతనివాసినియే యామె నాకు మాతా సన్నిభయే - కనగలోక జనయిత్రి వంటిదియా — ఘన శీలను గులటయనగ నిటువలె ॥తగునా॥

## 38. కొండారెడ్డి — బ్యాగ్— ఆది.

ప్రశయంబు జనించినగానీ పరి — పంథి కులము మాసిన గానీ కళవళ మందగఁజేసెద వైరుల — ఖరాసి ధారల కెరగావించెద ॥ప్ర॥ కులవినాశంబు గలుగఁగ రాజుల గొలిచి యింత దుర్యశ మందితిగా ॥ప్ర॥ ఖలుడవై — దురితమున్ — సలిపితిగ — చపలతగ — విల సితాన్వయు ప్రతిభనుగంగను — వెలయించితి — నికజూపెద — ధీరత ॥ప్ర॥

## 39. కొండారెడ్డి — బ్యాగ్ - ఆది.

దొరికితివారా - దుర్మదచోరా — దుష్టుఁడవే యఘచారా_ బిరబిర నిన్నీ — ఖరాసి ధారను — బరిమార్చెదరాక్రూరా ॥దొ॥ పరాక్రమించితివోరా - బిరాన నిన్నీ ఘోరా — రణ్యంబునందే భీకరగతి ప్రా - ణంబులు దీసెద నౌరౌరా ॥దొ॥

## 40. కొండారెడ్డి — ముఖారి — కురుజంపె.

దైవమా నేనేమి — తలచి యొనరించితినో - యావిధము నేటి మృషాకథన మయ్యెగా ॥దై॥ పాపమని ఖడ్గనా - రాయణునిఁ గూల్చితిని - యనవేమ పతికి నే — మని వార్త వినిపింతు ॥దై॥

## 41. కేదారనాథుఁడు - బ్యాగ్ - ఆది.

ఇదె వచ్చితి నీప్రాణములన్ హరియింపగ — తుణకాల మా గరా ॥ఇ॥ మదహంకార వినోదుండవగుచు — మాయోదధి మునిఁచి తివా మమ్ముల — సదయోత్ముఁడవై — ప్రతిజ్ఞాభంగ - మాచరింప దలఁచితివా త్రలపడి ॥ఇ॥

42. వ అనుబంధము గ్రంథ మధ్యమున గలదు.

43. అనపోతనాయఁడు.

విచారముల కిదిమందూ సుఖ పరిచారముల కిది ఖామందూ ॥వి॥ విచారములకు గ్రా - హాచారములకూ - పిశాచములకును - పేరగు ముందూ ॥వి॥ హుషారి నీయగ విందూ - బల్ - ఘనం దయినదీమందూ - టక్కరి వేదాం - తములు బలుకు దు - ష్టాత్ముల కెఱుంగరాదిల నెందూ ॥వి॥

44. రాణి—అది.

ఛీ! యెందుల కీ బ్రదుకు - కడు శూరత్వమును గనుబరచితి కడు రణశూరత్వంబును గనబరచితి ఛీ! కటకట సద్వంశమున జనించియుఁ - గలుషమంచు నీ మనమున దలఁపక - నిటుల సురాపాన ప్రమత్తతను - హీనుఁడనై మానినుల వధింపఁగ ॥ఛీ॥

45. వెంకన్న—బాగ్—త్రిశ్రగతి.

చుం - చుం - చుం - చుం - చుం - చుం - చుం - చుం - చుం - చుం - చుం - చుం - నీకూ నాకీరాత్రే చుం - లేకుంటే చచ్చేనే చుం లు-ల్లూ లు - ల్లూలు - లూ - లూ - లూ - లూ - లూ - లూ లూలు నాదు నాకడ పోకడలూ - చూచి యార్పవె దీపాలూ డు - డ్డూ డూ - డూ - డూ - డూ - డూ - డూ - డూ - డూ - డు;

46. అనవేమారెడ్డి—కన్నడ—రూపకం.

ఎన్నడు నా చిన్నిసుతుని - కన్నులారఁగాంతునో ॥ఎ॥ మన్నించి నాయంకపాళి - మరలనింకొక పరిజేర్తునో సభలోనన్ బరిభవించుట - చాలకగడు నోనాడితి అభము శుభము నెఱుఁగని సుతు - నాఱునెలలు శిక్షించితి ॥ఎ॥

47. అనవేమారెడ్డి—భాగేశ్వరి—ఆది.

ఎన్నిదినములకు - కన్నులఁబడితివో — యన్నానాకుల దీపమ - తనయా ॥ ఎ॥ ఎన్నిశ్రమలు సహిం - యించితివోకద - నన్నేమని దూషించితివోసుత - పన్నుగనడవుల - లోనిడుమల నా- పన్ను - డవై గాంచితివో గుణనిధి ॥ఎన్ని॥

48. మంగళ హారతి—బ్యాగ్—త్రిశ్రగతి.

మందరధర - మంగళకర— మంగళంబురా- మారసుందరా— శ్రీరమేశ బ్రోవరా ॥మం॥ దాసభరణ — దోషహరణ - దానవేశ నాశా - శ్రీనివాసజగదీశా — శ్రీరమా - నాయకా — జగన్నా యకా ॥మం॥

ధరణికోట అనుబంధములు సంపూర్ణము.

—*—



గ్రామస్వరాజ్య ప్రెస్, విజయవాడ - 2.

ఆంధ్రదేశమంతటా ప్రఖ్యాతిజెందిన నాటకములు

కీర్తిశేషులైన

సోమరాజు రామానుజరావుగారివి



| | |
|---|---|
| ధరణికోట | 1-12-0 |
| రంగూన్‌రౌడి | 1-12-0 |
| సతీసక్కుబాయి | 1-12-0 |
| దానవీరకర్ణ | 1- 8-0 |
| ప్రతాపరుద్రీయము | 1-12-0 |
| భోజకాళిదాసు | 1- 8-0 |
| కాలకేతనము | 1- 8-0 |
| సతీఅనసూయ | 1- 8-0 |
| గంగావతరణము | 1- 8-0 |
| భీష్మబ్రహ్మచారి | 1- 8-0 |
| మహాభక్తవిజయము | 1- 8-0 |
| తాజమహాలు | 1- 8-0 |
| కర్ణదారి, (ఊటుకూరి) | 1- 4-0 |
| రామోద్యోగ విజయములు (మాచెర్ల) | 1- 0-0 |
| కలియుగవైకుంఠము (తాండ్ర) | 1- 8-0 |
| సతీసులోచన | 1- 4-0 |

---

**DARANIKOTA**
*By*
SOMARAJU **Rs. 1-75 n. p.**

**Saraswathi Book Depot,**
*Publications.*